# మిసిమి

***"All that we are is the product of what we have thought," is "We are what we think." — Dammapada.***


సంపుటి 7 సెప్టెంబర్ 1995 సంచిక 74

సంపాదకుడు : **రవీంద్రనాథ్ ఆలపాటి** Ph.D (U.S.A.)


## విషయసూచిక



ముఖచిత్రం :

**Beneath our nakedness, we are naked still**

***"Dreams of a young girl"***


Printed, Published and Edited by RAVINDRANATH ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337

**Editorial NEST**

Plot No 337 A, Road No 10, Jubilee Hills, Hyderabad - 500 033. Ph 247717

## Beneath our nakedness, we are naked still

Beneath our nakedness, we are naked still
Within the mind, history and stars expose
Our bodies' frailty and a new day blows
Away huts and papyri of the will
The Universe, by inches, minutes, fills
Our tongues and eyes where name and image show
With words and pictures. Star and history know
Their legends in our minds, time kills
Revolving with the earth's rim through the night
We conscious fragments, pulsing blood and breath,
Each separate in the self, yet reunite
For that dark journey to no place or date
Where, naked beneath nakedness, beneath
Our human generation, we await
The multitudinous loneliness of death

## You were born, must die; were loved, must love;

You were born, must die, were loved, must love,
Born naked, were clothed; yet naked walk
Under cloth flesh, ghosts move
Hollow, hollow, hollow, under clock-talk, star-talk
Time and space upon you feed,
Upon your eyes, their far horizons;
Upon your heart, their searing need,
Upon your death, empty significance.
There is one fate beneath that ignorance,
All humanity, of which you are part,
O Self of flesh and thought and breath·
Chalk-faced, diamonded harlequin, it
Strums on your gut such songs and pleasant dances,
Amor, O solitude, O seldom death

**— Stephen Spender**

# అణువాదులు

- ఏటుకూరి బలరామమూర్తి

మూల వస్తువు ఏది, దాని స్వభావం ఏమి అని గ్రీక్ తాత్వికులు ఇంతవరకూ చర్చించారు పిమ్మట మూల వస్తువు విభాజ్యమా, అవిభాజ్యమా అనే అంశంలోకి వెళ్ళారు

వస్తువు విభాజ్యం, అణువు మాత్రం అవిభాజ్యం అని అణువాదులు అన్నారు వీరిలో ముఖ్యుడు, సుప్రసిద్ధుడు డెమొక్రటీస్

త్రేస్ ద్వీపకల్పంలోని అబ్దెరాలో ఇతడొక సంపన్న వ్యాపార కుటుంబంలో జన్మించాడు వ్యాపారార్ధం తండ్రి విదేశాలకు పంపగా, వ్యాపారం సంగతి వదలి మతం, తత్వశాస్త్రం, ప్రకృతి పరిశీలనలతో కాలం గడిపి తిరిగి వచ్చాడు

తోటి వారంతా హేళన చేసి, విమర్శించారు తాను దేశ దేశాలలో చూసిన విషయాలను ఓర్పుతో వివరించిన మీదట కొంత సర్దుకుని, ''నీవు తెలుసుకున్న అంశాలపై ఒక గ్రంధం రాయ''మని ఆదేశిస్తూ తిరిగి సముద్ర యానాని కవసరమైన తోడ్పాటు ఇచ్చారు

ఇలా అనేకసార్లు మధ్యధరా తీర ప్రాంతాలు తిరిగాడు ఈజిప్టు, బాబిలోనియాలు వెళ్ళాడు ఈ రెండు అప్పటికే సంస్కృతి కేంద్రాలుగా ప్రసిద్ధి చెందినవి

స్వదేశం వచ్చినమీదట "Universe around us" (మన చుట్టూ వున్న విశ్వం) అనే గ్రంధాన్ని తయారు చేశాడు అందులో ఇలా రాశాడు

గ్రీస్ దేశంలో దేవతలందరూ అపోలో పర్వతంపైన వున్నారంటారు సైప్రస్ దీవిలో గుహలలో వుంటారు ఈజిప్టులో పిరమిడ్స్‌లో వుంటారు బాబిలోనియాలో గుళ్ళలో వుంటారు

దేవత లందరూ ఒక్కొక్క దేశంలో ఒక్కొక్కచోట ఎందుకుంటారు? ఒకేచోట ఉంటే ఏం పోయింది? అసలు దేవతలంటూ వున్నారా? ఇదంతా మన ఊహ మాత్రమేనేమో!

సృష్టికి దేవతలు కారణం కాకపోతే మూలం ఏమిటి? పదార్ధం ఇది ఏ రూపంలో వుంటుంది అణువుల రూపంలో కంటికి కూడా కనపడని, చేతితో స్పృశించలేని రూపంలో అణువు లుంటాయి ఇవి గుణాత్మకంగా అన్నీ సమానమే పరిమాణంలో మాత్రమే తేడా కొన్ని బరువైనవి కొన్ని తేలికైనవి

ఈ సిద్ధాంతాన్ని వివరిస్తూ డిమొక్రటీస్ చాలా గ్రంధాలు రాశాడు ఇపుడు ఒక్కటీ లేదు కాలగర్భంలో కలిసిపోయాయి అచ్చు యంత్రాలు లేని ఆ రోజులలో గ్రంధాలను కాపాడటం బహుకష్టం

ప్లేటో, డెమొక్రటీస్‌లు సమకాలికులు ప్లేటో తన గ్రంధంలో ఎక్కడా డెమొక్రటీస్ పేరు కూడా ఉదాహరించడు భావవాది అయిన ప్లేటో భౌతికవాది అయిన డెమొక్రటీస్ గ్రంధాలను ఉపేక్షించటమే కాదు, కొన్నిటిని ధ్వంసం చేయించాడు అంటారు

ఆ తర్వాత వచ్చిన అరిస్టాటిల్ రచనల ద్వారానే మనం యీ మాత్రమైనా డెమొక్రటీస్‌ను గురించి తెసుసుకోగలుగుతున్నాము

డెమొక్రటీస్‌తోపాటే లుసిప్పస్ అనే పేరు కూడా జతగా వస్తుంది వారిద్దరు అణువాదానికి మూలపురుషులు లుసిప్పస్ అనే వ్యక్తి అసలు లేనేలేడు అని కొందరంటారు

అణువాద మూలపురుషులను గురించి ఇంతటి అశ్రద్ధ, అజ్ఞానం యిప్పటికీ ప్రచారంలో ఉండటం విచారకరం నిజం ఎప్పటికి బహిర్గతమౌతుందో!

డెమొక్రటీస్‌కు ముందు సిసిలీలో ఎంపిడొక్లీస్ అనే తత్వవేత్త ఉండేవాడు అతనికాలం క్రీ పూ 495-435 డెమొక్రటీస్ తర్వాత అనెగ్జొగరస్ అని మరో తత్వవేత్త ఉండేవాడు అతనికాలం

క్రీ పూ 500 ఈ మధ్యలో డెమొక్రటీస్ ఉన్నాడు వీరందరు యించుమించు సమకాలీనులు

**ముగ్గురు మూర్తులు**

ఎంపిడొక్లీస్, డెమొక్రటీస్, అనెగ్జాగరస్ - ఈ ముగ్గురి తాత్విక చింతన ఒక క్రమపద్ధతిలో ముందుకు సాగింది అణువాదం ఒక్క రోజులో ఉద్భవించలేదు

ఎంపిడొక్లీస్ కణవాదం (Theory of Particles) ప్రచారంలో పెట్టాడు

పదార్థం ఒకరు సృష్టించినది కాదు మరొకరు నాశనం చేయలేరు కూడా ఇది ఎంపిడొక్లీస్ మొదటి సూత్రం పదార్థం నిత్యమూ, పరిణామశీలమూ

ఈ రెంటినీ ఎలా సమన్వయం చేయాలి?

వస్తువులు పుడుతూ, పరిణామం చెందుతూ, రూపాంతరం చెందుతూ ఉంటాయి వస్తువులలో అంతర్గతమైన కణాలు (particles) మాత్రం శాశ్వతం

ఈ సూత్రాన్ని ఎంపిడొక్లీస్, డెమొక్రటీస్, అనెగ్జాగరస్ ముగ్గురు ఆమోదించారు అయితే ముగ్గురు యీ మూలధాతువులకు మూడుపేర్లు పెట్టారు ఎంపిడొక్లీస్ కణం అన్నాడు డెమొక్రటీస్ అణువు అన్నాడు అనెగ్జాగరస్ 'నౌస్' అన్నాడు 'నౌస్' అంటే ఏమిటో తర్వాత తెలుసుకుందాం

కణం అని చెప్పిన ఎంపిడొక్లీస్ మరొక ప్రశ్నకు సమాధానం చెప్పవలసి వచ్చింది

అన్ని వస్తువులు కణ సముదాయాలైతే, యీ కణాలు ఎందుకు కలుస్తాయి, ఎందుకు విడిపోతాయి

ఆకర్షణ, నిరాకరణ (attraction and repulsion) అను రెండు కారణాల వలన కణాలు కలుస్తూ విడిపోతూ ఉంటాయని ఇతడి వాదన

ప్రాచీన తాత్వికులు వాడే మాటలు, వాటి అంతరార్థాలను మనం లోతుగా గ్రహించాలి ఎంపిడొక్లీస్ ఆకర్షణ, నిరాకరణ అనటానికి బదులు ప్రేమ, ద్వేషం అంటాడు ఇవి మానవ లక్షణాలు కదా మూలధాతువులైన కణాలకు ప్రేమ, ద్వేషాలెందుకుంటాయి ప్రేమ, ద్వేషం అనే మాటలను ఎంపిడొక్లీస్, భౌతికార్థంలో ఆకర్షణ, నిరాకరణలకు ప్రత్యామ్నాయంగా వాడాడు

ఇక్కడొక పోలిక చెబుతాను సత్వ, రజస్, తమోగుణాలు అని సాంఖ్యులు వాడారు ఇవి మానవ స్వభావ విశేషాలు కాని ఇవి భౌతిక లక్షణాలుగా కపిలుడు వ్యాఖ్యానించాడు సత్వగుణం అంటే లఘుత్వం రజోగుణం చలత్వం తమోగుణం గురుత్వం లఘు, గుణ, చల - అనేవి భౌతిక భావనలు తేలికైనది, బరువైనది, కదిలేది - అని

భౌతిక లక్షణాలను, మానసిక స్వభావాలను కలిపి వాడటం ప్రాచీనుల పద్ధతి శరీరంలోని భౌతిక లక్షణాలే మానసిక వివరాల రూపంలో వ్యక్తమౌతాయని వారి భావం

గ్రీక్ తాత్వికులు ఇదే విధంగా ఆలోచించారు

ఎంపిడొక్లీస్ భావన మరొకటి వుంది నేల, గాలి, అగ్ని, నీరు - చతుర్భూతాలు మిగతావన్నీ యీ చతుర్భూతాల కలయిక, వేర్పాటు ద్వారానే ఉద్భవిస్తాయి

తాత్విక చింతన ఒక అడుగు వెనక్కు, పిమ్మట ఒక అడుగు ముందుకు వేస్తుంది దీనినే (Negation of Negation) విరోధ వైరుధ్యం అంటారు

థేల్స్ మొదలైన తొలితరం తాత్వికులు నీరు, నిప్పు, గాలి - మూలవస్తువులుగా పేర్కొని, ఈ మూలవస్తువులకు చలనం, మార్పు సహజలక్షణం అన్నారు

మూలవస్తువును విభజించి, కణం అని చెప్పిన ఎంపిడొక్లీస్ కణానికి చలనం సహజలక్షణం కాదంటాడు అయినా మార్పు వున్న దంటాడు మరి యీ మార్పు ఎలా వస్తుంది

బాహ్యశక్తులైన ప్రేమ, ద్వేషం, స్నేహం, ఘర్షణ, ఆకర్షణ, నిరాకరణల ద్వారా చలనం అంతర్గర్భితం అనే థేల్స్ భావన కంటె ఎంపిడొక్లీస్ భావన వెనుకడుగు పదార్థం, చలనం (Matter + Motion) అవిభాజ్యం అని నేటి ఆధునిక విజ్ఞానం ఘంటాఘోషగా తెలియజేస్తున్నది

అయితే ఎంపిడొక్లీస్‌ను గురించి ప్రస్తావించవలసిన అవసరం ఏమిటి? తాత్విక పురోగతిలో యితడు నిర్వర్తించిన పాత్ర ఏముంది?

పదార్థాన్ని విభజించి కణం అనటం యితడిలో విశేషం ఆ తర్వాత వచ్చిన డెమొక్రటీస్, కణం అనే మాటను వదలి అణువు అన్నాడు డెమొక్రటీస్ భావవికసనకు పరోక్షంగా తోడ్పడినవాడు ఎంపిడొక్లీస్ 'కణం' అనే పదంపై కాలుపెడితే కదిలిపోతుంది 'అణువు' అనే గట్టి మెట్టును డెమొక్రటీస్ భావించక తప్పలేదు

తాత్విక పురోగతి యిలా సాగింది

**అణువు – ఆకాశం**

అణువులు ఒక దానికొకటి పక్కపక్కనే ఆనుకుని వుంటే, కదలిక ఎలా సాధ్యం కదలిక ఉండాలంటే ఖాళీస్థలం ఉండాలి ఇదే (Space) ఆకాశం

అత్యాధునికుడైన న్యూటన్ సైతం అణువుల మధ్య ఖాళీస్థలం ఉంటుందని, దానినే ఆకాశం అని అన్నాడు

ఐన్‌స్టీన్ సాపేక్షవాదం, క్వాంటం సిద్ధాంతాలు తలయెత్తిన మీదట ఆకాశం అంటే శూన్యం కాదని, కాంతిపుంజం, అలల రూపంలో కణప్రసరణ, శూన్యం అనబడే ప్రాంతాన్నంతా ఆక్రమించి ఉంటుందని యిప్పుడు శాస్త్రజ్ఞులు చెబుతున్నారు

అణువు, ఆకాశం లేక ఖాళీ ప్రాంతం అను మాటలనే, గ్రీక్ భాషలో, ప్లీనం, వాక్యూం అనేవారు ప్లీనం అంటే విస్తృత సమావేశం అని ప్రస్తుతం అర్థం భాష ఎలా మారిపోతుందో యిదొక ఉదాహరణ

అనంతాకాశంలో అణువులు నిరంతరం క్రిందపడుతుంటాయి బరువైనవి త్వరగానూ, తేలికైనవి నెమ్మదిగానూ (గురుత్వాకర్షణ సూత్రం ప్రకారం అన్ని అణువులు ఒకే వేగంతో కదులుతుంటాయని ఆధునిక శాస్త్రజ్ఞులు చెపుతారు బరువు, తేలిక అనే వ్యత్యాసం లేదు)

ఈ నిరంతర అణుసంచలనం విశ్వసృష్టికి కారణం ·అణువులు అనంతం, విశ్వగోళాలు అనంతం, భూమి అట్టి గోళాలలో ఒకటి

అణువులు ఎందుకు నిరంతరం కదులుతాయి? ఈ కదలిక యాంత్రికమైన అనివార్యతా సూత్ర ప్రభావం

డెమొక్రటీస్ ముమ్మూర్తులా భౌతికవాది ఆనాటి భౌతికవాదు లందరూ ఈశ్వరుడ్ని నిరాకరించారు ఆత్మభావనను త్రోసిపుచ్చలేకపోయారు ఆత్మ సున్నితమూ, మృదువైన అణువులతో కూడి ఉంటుందని శరీరానంతరం కొంతకాలం ఆత్మ జీవించి ఉంటుందని, శాశ్వతం మాత్రం కాదని డెమొక్రటీస్ అంటాడు

అణువులు ఇంద్రియాల మీద స్పందన కలిగిస్తాయి ఆత్మ ప్రశాంతంగా ఉన్నప్పుడు ఆలోచన సవ్యంగా ఉంటుంది వాసన, రంగు, రుచి, ఇంద్రియ గ్రహణం వలన ఏర్పడుతాయి ఇంద్రియాలు లేకపోతే యీ లక్షణాలే ఉండవు

**ఎపిక్యురస్**

డెమొక్రటీస్ తర్వాత రెండు శతాబ్దాలకు ఎపిక్యురస్ ఆవిర్భవించాడు (క్రీ పూ 342-270) కాలపట్టిక దృష్ట్యా కాకపోయినా, భావసామ్యత వున్నందున ఎపిక్యురస్‌ను గురించి కూడా యీ సందర్భంలోనే ప్రస్తావిస్తాను

అణువాదాన్ని అంగీకరించి విస్తరించిన వారిలో ఎపిక్యూరస్ ముఖ్యుడు ఒకటే తేడా. అణువులు అనివార్యతా సూత్రాన్ననుసరిస్తాయని డెమొక్రటీస్ అనగా, ఈ సూత్రానికి మినహాయింపులున్నాయని, అణువుల సంచలన సూత్రం ఇదమిత్థం అని చెప్పలేమని ఎపిక్యూరస్ అంటాడు

ఎపిక్యూరస్ అనగానే యీనాడు స్వేచ్ఛావాది, సుఖవాది అనుకుంటాము

12 ఏండ్ల వయస్సులో ఎపిక్యూరస్ ఒక ఉపాధ్యాయుని వద్ద విన్నాడు ''ఈ ప్రపంచం అంతా మహాశూన్యం నుండి ఆవిర్భవించింది'' అని

''మహాశూన్యం ఎక్కడి నుంచి వచ్చింది'' అని ఎపిక్యూరస్ ఉపాధ్యాయుణ్ని ప్రశ్నించాడు.

''నాకు తెలియదు'' అని గురువు సమాధానం ''ఎవరికీ తెలియదు.''

నేను తెలుసుకుంటాను అని ఎపిక్యూరస్ తనలో అనుకున్నాడు ఈ అన్వేషణలో రెండు శతాబ్దాల క్రితం డెమొక్రటిస్ ప్రతిపాదించిన అణువాదం వైపు మొగ్గాడు

మహాశూన్యం నుండి ప్రపంచం ఉద్భవించజాలదు శూన్యం సృష్టికి కారణం కాదు పదార్థ సముదాయం అంతా అతి సూక్ష్మమైన అణు సమూహం అణువులు సృష్టికి మూలమైన సూక్ష్మాతిసూక్ష్మ పరికరాలు ఎపిక్యూరస్ వాడిన మాట 'ఇటుకలు'

అనంతగోళాలలో ఈ భూగోళం ఒకటి బ్రహ్మాండభాండమంతా నిరంతర చలనశీల అణుసముదాయం (అణోరణీయాన్ మహతో మహీయాన్)

అణువుల ఆకారం, బరువు వేర్వేరు రూపాలలో వుంటాయి పర్వతాలు, నదులు, జంతువులు, మానవులు ఏర్పడటానికి అణు సంఘటనే కారణం మానవులు మహాసముద్ర తీరంలో ఇసుక రేణువులు

ఇదంతా స్వయం చలనం ద్వారా జరుగుతుంది. బాహ్యశక్తి, అదృశ్యహస్తం, మార్గనిర్దేశకత్వం, ఉద్దేశం **(purpose)** అంటూ ఏమీ లేవు

దేవతలంటూ వున్నారనుకున్నా, వారి దోవ వారిది సృష్టికి ఏమీ సంబంధంలేదు స్వర్గంలో వారి జీవితాలు వారు అనుభవిస్తూ వుంటారు

మానవులను గురించి దేవతలు ఆలోచించనపుడు దేవతల గురించి మానవులు ఎందుకు ఆలోచించాలి ''దేవతలు సద్గుణవంతులని భావించుకుంటే మానవులు కూడా అలా కాగలరు'' కనుక

ఎపిక్యూరస్ భావాలను అతని శిష్యుడు లుక్రిషియస్ రచించిన ''ప్రపంచ స్వభావం'' అనే గేయం ద్వారా గ్రహించవచ్చు ఇందులో రెండు అంశాలున్నాయి

ఆధునిక యుగంలో డార్విన్ ప్రతిపాదించిన పరిణామ వాదాన్ని ఎపిక్యూరస్ ఆనాడే అతి ప్రాథమిక రూపంలో చెప్పాడు

అనాగరిక, ఆటవిక దశనుండి క్రమేపీ మానవుడు నాగరికతను నేర్చుకున్న విధం వివరించాడు

రొట్టె ముక్క, నీరు, తత్త్వశాస్త్రమనే ద్రాక్ష పానీయం - వుంటే తృప్తిగా జీవించవచ్చునని ఎపిక్యూరస్ భావించాడట తత్వశాస్త్రం ద్రాక్షపానీయం అనటంతో అనేక అపార్థాలు కలిగాయి

ఎథెన్స్‌లో ఒక తోటలో ఎపిక్యూరస్ తాత్విక పాఠశాల నడిపేవాడు స్త్రీలు, పురుషులు, యజమానులు, బానిసలు, వ్యభిచారిణులు సైతం ఏ వ్యత్యాసం లేకుండా అందులో చేరేవారు ఆ రోజుల్లో స్త్రీలను చేర్చుకున్న పాఠశాల మరొకటి లేదు.

దీంతో ఎపిక్యూరస్ అంటే సుఖవాది అని లోకం నేడు భావిస్తున్నది

(సశేషం)

# మద్రాసు ప్రెసిడెన్సీలోని సంస్కరణోద్యమాలపై
# ప్రొఫెసర్ పి. లక్ష్మీ నరసు ప్రభావం

– టి. రవిచంద్

డా బి ఆర్ అంబేద్కర్‌ను ప్రభావితం చేసిన ఆంధ్రుడు, బౌద్ధ పండితుడు, కులనిర్మూలన వాది ప్రొఫెసర్ పోకల లక్ష్మీ నరసు 1934 జూలై 14వ తేదీన గుండెపోటుతో మద్రాసులోని ఆయన స్వగృహంలో మరణించారు 1860లో జన్మించిన లక్ష్మీనరసు 74 సంవత్సరాలు జీవించారు తన జీవితాన్ని బౌద్ధ మత పునరుద్ధరణకు, ప్రచారానికి, సంఘ సంస్కరణకు అంకితం చేశారు దక్షిణ భారత బౌద్ధ సంఘాలకు (The South Indian Buddhist Societies) జీవితపర్యంతం అధ్యక్షుడుగా వున్నారు 1900వ సంవత్సరంలో ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడైన ఎమ్ సింగారవేలు చెట్టియార్‌తో కలిసి ''మహాబోధి సొసైటీ'' స్థాపించారు ప్రొఫెసర్ లక్ష్మీనరసు బౌద్ధమత పునరుద్ధరణ, ప్రచారంతోపాటు దళితవర్గాల అభ్యున్నతికై చాలా కృషిచేశారు ఆ వర్గాల్ని విద్యావంతుల్ని చేయడం కోసం ప్రాథమిక విద్యా సంస్థల్ని నెలకొల్పారు మహాబోధి సొసైటీ అనాగరిక ధర్మపాల నాయకత్వంలో సామాజికంగా ఉన్నత స్థితిలో వున్న ప్రజలలోనే తమ కార్యక్రమాలు నిర్వహిస్తుండేది ఈ విషయంలో ప్రొఫెసర్ క్ష్మీనరసు వారితో విభేదించారు ఆయన సామాజిక సంస్కరణ దృష్టితో బౌద్ధ మతాన్ని వ్యాఖ్యానించి, దాన్ని ప్రచారం చేశారు ఆ దృష్టితో ఆయన ''ది ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'' (1907), ''ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్'' (1922) అనే గ్రంథాల్ని రచించారు అందువల్లనే పైన పేర్కొన్న రెండో గ్రంథాన్ని మద్రాసు క్రిస్టియన్ కాలేజీ మ్యాగజైన్ (Vol III, 1923) లో పరిచయం చేస్తూ ఒక సమీక్షకుడు దాన్ని గురించి ఇలా అన్నారు ''చరిత్రకారుడిగా కంటె ఒక సామాజిక సంస్కర్తదృష్టితో ప్రస్తుత గ్రంధం రచించబడింది '' అందువల్ల ప్రొఫెసర్ లక్ష్మీనరసు బౌద్ధ మతాన్ని సామాజిక సంస్కరణను అభిలషిస్తూ ప్రచారం చేశారని, గ్రంథ రచన చేశారని భావించవచ్చు. దక్షిణ భారతదేశంలో బౌద్ధ మత పునరుద్ధరణలో ఆయన నిర్వహించిన పాత్రను గుర్తించిన అమెరికన్ పరిశోధకురాలు ఎలియనార్ జెలియట్ ఇలా ప్రస్తుతించారు "The most conspicuous figure in the revival, however is P Lakshmi Narasu, a Buddhist and writer and missionary in the cause of Buddhism" (ఏది ఏమయినప్పటికీ ప్రొఫెసర్ లక్ష్మీ నరసు బౌద్ధ ధర్మ పునరుద్ధరణలో గణింపదగిన వ్యక్తి బౌద్ధ ఉద్యమంలో ఆయన బౌద్ధుడు, రచయిత, ప్రచారకుడు) అయితే ఈ అమెరికన్ పరిశోధకురాలు ఆయన్ని ''తమిళుడు''గా పేర్కొన్నారు. ప్రస్తుత వ్యాసకర్త అధ్యయనం ద్వారా తేలిన దాన్ని బట్టి ప్రొఫెసర్ లక్ష్మీనరసు ''తెలుగువాడు'' అని చెప్పడానికి ఎటువంటి సందేహానికి ఆస్కారం లేదు (చూ డా బి ఆర్. అంబేద్కర్‌ను ప్రభావితం చేసిన ఆంధ్రుడు, మిసిమి, నవంబర్ 1993) అంతేకాదు, ఈమధ్యనే లభించిన ప్రొఫెసర్ లక్ష్మీనరసు మరొక ముఖ్యమైన గ్రంధం కూడ ఆయన తెలుగువాడు అని నిరూపిస్తుంది 1916లో ప్రథమ ముద్రణపొందిన ఆ గ్రంథం ''వాట్ఈజ్ బుద్ధిజం?'' (బౌద్ధం అంటే ఏమిటి?) ఇది 1946లో పునర్ముద్రణ పొందిన సమయంలో ఆనాటి మహాబోధి సొసైటీ ఆఫ్ ఇండియా ప్రధాన కార్యదర్శి దేవప్రియ వాలిసిన్హా ముందు మాట రాసి, ప్రొఫెసర్ లక్ష్మీనరసు కృషిని కొనియాడారు మద్రాసులోని మహాబోధి సొసైటీ తరపున పనిచేయడానికి రెవరెండ్ నీలకర్కె సోమనంద థేర శ్రీలంక నుండి వచ్చినప్పుడు, ఆయనకు ప్రొఫెసర్ లక్ష్మీనరసు ఎలా సహకరించిందీ దేవప్రియవాలిసిన్హా ముందు మాటలో ఇలా వివరించార

'' Prof. Narasu not only assisted him in every way possible but also under took to coach him in Tamil and Telugu." ఆయన రెవరెండ్ నీలకర్కె సోమనంద థేర్కు సాధ్యమైన అన్ని విధాల సహకరించటమే కాకుండా, ఆయనకు తమిళ, తెలుగు భాషల్లో శిక్షణ

నిచ్చారు ఆయన తమిళనాడులో స్థిరపడటంవల్ల ఆయనకు తమిళ భాషా సాహిత్యాలతో గాఢమైన పరిచయం ఏర్పడింది ఆ భాషలో బౌద్ధంపై రచనలు కూడా చేశారు అదేసమయంలో మాతృభాషయైన తెలుగును మాత్రం విస్మరించలేదు ఆయన బి ఏ లో ద్వితీయ భాషగా తెలుగును చదివారు అందువల్ల నీలకణ్ఠ-సోమనంద థేరకు తెలుగు భాషను నేర్పగలిగారు తద్వారా ఆయన తెలుగువాడని నిరూపించడానికి బలమైన మరో ఆధారం లభించింది ఆయన ఇంటిపేరు ''పోకల'' కావడం, ఆయన పేరు చివర కులచిహ్నమైన ''నాయుడు'' అనేపదం వుండటంవల్ల కూడా ప్రొఫెసర్ లక్ష్మీనరసు తెలుగువాడని నిస్సందేహంగా చెప్పవచ్చు తెలుగువారి ఇంటిపేర్లలో ''పోకల'' అనే ఇంటిపేరు వుంది ఆ ఇంటి పేరు గలవాళ్ళు తెలుగువారిలో చాలామంది వున్నారు. ఇన్ని ఆధారాలవల్ల ప్రొఫెసర్ లక్ష్మీనరసును నిశ్చయంగా తెలుగు వాడిగా భావించవచ్చు ఈ అంశాన్ని మరొకసారి ఎందుకు ప్రత్యేకంగా ప్రస్తావించాల్సి వస్తుందంటే, ఈమధ్య దక్షిణ భారతదేశంలో ఆధునిక యుగంలో బౌద్ధమతాన్ని గురించి రాసేవాళ్ళు ఆయన్ని తమిళుడుగా భావించి రాస్తున్నారు (చూ డి సి అహీర్, బుద్ధిజం ఇన్ సౌత్ ఇండియా, 1992, పేజీలు 150-151) అందువల్ల ప్రొఫెసర్ లక్ష్మీనరసు మన తెలుగువాడని మరోసారి గుర్తుచేస్తున్నాడు ప్రస్తుత వ్యాసకర్త

తమిళనాడు (ఆనాడు తెలుగువారు మద్రాసు ప్రెసిడెన్సీ కింద వుండేవారు) లో మన తెలుగువారు బ్రహ్మసమాజంలో, బ్రాహ్మణేతర ఉద్యమంలో, జస్టిస్‌పార్టీలో, మహాబోధి సొసైటీలో, దివ్య జ్ఞాన సమాజంలో చాలా ప్రముఖపాత్ర వహించారు అటువంటి వారిలో గాజుల లక్ష్మీనరసుచెట్టి, పెరియార్ రామస్వామి, సర్ పిట్టి త్యాగరాయశెట్టి లాంటి వారెందరో ఆనాడు తమిళ సామాజిక, రాజకీయ, సాంస్కృతిక జీవనంలో ప్రముఖ పాత్ర వహించడమే కాకుండా దానిపై మరువ లేని ముద్రవేశారు అటువంటి వారే మన తెలుగు వెలుగు పోకల లక్ష్మీనరసు 1922వ సంవత్సరంలో ఆయనచే రచించబడిన ''ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్'' (కులం-ఒక అధ్యయనం) గ్రంధాన్ని ఆనాడు బ్రాహ్మణేతర ఉద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన సర్‌పిట్టి త్యాగరాయశెట్టికి, స్నేహానికి, కృతజ్ఞతకు వ్యక్తీకరణగా అంకితం చేశారు సర్ పిట్టి త్యాగరాయశెట్టి జస్టిస్‌పార్టీ అగ్రనాయకుల్లో ఒకరు జన్మతః ''దేవాంగ'' కులంలో జన్మించారు

మన తెలుగువారు గర్వించదగ్గ మహామేధావి ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు ఆయన కేవలం బౌద్ధ ధర్మంలో పండితుడు, పరిశోధకుడు మాత్రమే కాదు. బౌద్ధ ధర్మ పునరుద్ధారకుడు, ప్రచారకుడు ఆంగ్ల భాషలో బౌద్ధధర్మంపై నాటికి లభించే గ్రంధాలన్నీ అధ్యయనం చేశారు అనేక అరుదైన గ్రంధాల్ని దేశ, విదేశాల నుండి సేకరించారు జర్మనీ, ఫ్రెంచి భాషల్లోని గ్రంధాల్ని సయితం ఆయా దేశాలనుండి తెప్పించి, విస్తృతంగా అధ్యయనం చేశారు ఈ రెండు భాషల్లో ఆయనకు మంచి భాషా పరిజ్ఞానం వుంది కొలంబో వెళ్ళి వచ్చిన తర్వాత బౌద్ధ ధర్మంపై ఆయనకు ప్రత్యేకమైన ఆసక్తి, అభిమానం ఏర్పడ్డాయి ప్రొఫెసర్ లక్ష్మీనరసు బహిరంగంగా బౌద్ధ ధర్మం స్వీకరించారు (డా బి ఆర్ అంబేద్కర్ 1956లో బౌద్ధ ధర్మాన్ని లక్షలాది ప్రజల సమక్షంలో బహిరంగంగానే స్వీకరించారు ) మహాబోధి స్థాపకుడైన అనాగరిక ధర్మపాలకు ఆయన మంచి స్నేహితుడు ఆయనతో కలిసి ప్రొఫెసర్ లక్ష్మీనరసు ఎక్కువగా దక్షిణ భారతదేశంలో బౌద్ధ ధర్మ పునరుద్ధరణకు ప్రయత్నించారు ఆయన మహాబోధి సొసైటీ మద్రాసు ప్రతినిధిగా 1909 నుండి 1928వరకు వున్నారు. దాని ప్రతినిధిగా ఆయన దక్షిణ భారతదేశంలో విస్తృతంగా పర్యటించారు అనేక సభలు, సమావేశాలు నిర్వహించి, బౌద్ధ ధర్మంపై ఉపన్యాసాలు చేశారు బౌద్ధ ధర్మాన్ని ఒక పరిశోధకుడుగా మాత్రమే అధ్యయనం చేయకుండా, ఒక సాంఘిక సంస్కర్తగా, తత్త్వజ్ఞుడుగా పరిశీలించారు. ఆ దృష్టితోనే ఆయన గ్రంథ రచన చేశారు ఆయన రచనల్లో అతి ముఖ్యమైన రచన ''ది ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'' (బౌద్ధ ధర్మసారం) ఈ గ్రంధం ఆధునిక భారతదేశంలో బౌద్ధ మత పునరుద్ధరణలో విశేషమైన కృషిచేసిన అనాగరిక ధర్మపాల డా.

బి ఆర్ అంబేద్కర్ వంటివారి ప్రశంసలందుకోవడమే కాకుండా, ప్రొఫెసర్ టి డబ్ల్యు రైస్ డేవిడ్స్, ప్రొఫెసర్ వార్లెస్ ఆర్ ఎస్ ల్యాన్‌మన్ (సంపాదకుడు, హార్వర్డు ఓరియంటల్ సిరీస్), డా సతీశ్ చంద్ర విద్యాభూషణ, ఫ్రాన్సిస్ జె పెయిన్ (ఎడిటర్, ది బుద్ధిస్ట్ రివ్యూ, లండన్), ఆనంద కుమారస్వామి లాంటి ఉద్దండ పండితుల అభిమానాన్ని చూరగొంది ఈ గ్రంథం ద్వారా ప్రొఫెసర్ లక్ష్మీనరసు బౌద్ధ ధర్మంలో గొప్ప పండితుడిగా గుర్తించబడ్డారు ఇది నేటికీ బౌద్ధ ధర్మాన్ని శాస్త్రీయ దృష్టితో అధ్యయనం చేయాలనుకొనే వారికి ఒక ఆధార గ్రంథం (Source Book)గా నిలుస్తుంది ''ప్రొస్పెక్టస్ ఆఫ్ బౌద్ధ ధర్మాంకుర్ సభ'' అనే గ్రంథం ఉపోద్ఘాతంలో రెబతిరమన్ బిరుయా ఈ గ్రంధాన్ని ఇలా ప్రశంసించారు ''పి ఎల్ నరసుకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను ఆయన గ్రంథం ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం చాలా వరకు ఈ ఉపోద్ఘాతం తయారు చేయడానికి సహాయపడింది ఆయన దీనిలో విషయాన్ని స్పృశించిన తీరు శుద్ధముగా శాస్త్రీయమైనది అందువల్ల వివేచనా జీవియైన ప్రతివ్యక్తిని అది ఆకర్షిస్తుంది బౌద్ధులకు, బౌద్ధేతరులకు; ఎవరయితే బౌద్ధాన్ని సంగ్రహంగా తెలుసుకోవాలను కొంటున్నారో, వారికి నేను ఈ గ్రంథాన్ని సిఫార్సు చేస్తున్నాను '' ప్రొఫెసర్ లక్ష్మీనరసు బౌద్ధ ధర్మాన్ని పూర్తిగా భౌతిక వాద దృక్పథంతో అధ్యయనం చేశారు, వ్యాఖ్యానించారు ఈ దృక్పథంతో బౌద్ధాన్ని వ్యాఖ్యానించిన వారు నాటికి భారతదేశంలో ఎవరూ లేరు అందువల్లే బ్రాహ్మణేతర ఉద్యమంలో అగ్రనాయకులైన పెరియార్ రామస్వామి, సి.ఎన్ అన్నాదురైకి బౌద్ధ ధర్మంపై అభిమానం ఏర్పడింది బౌద్ధాన్ని భౌతికవాద దృక్పథంతో వ్యాఖ్యానించి, దానిలోని సమతా ధర్మాన్ని వెలికి తీసి చూపించిన ప్రొఫెసర్ లక్ష్మీనరసు రచనల ప్రభావం ఆనాటి సామాజిక విప్లవోద్యమాలపై, సంస్కరణోద్యమాలపై పడటం ఆశ్చర్యంకాదు భౌతికవాద దృష్టితో బౌద్ధాన్ని వ్యాఖ్యానించడంవల్ల ఆయనకు, మహాబోధి సొసైటీ వారికి భేదాభిప్రాయాలు ఏర్పడ్డాయి థేరవాద బౌద్ధులు కూడ ఆయన వ్యాఖ్యానంతో పూర్తిగా ఏకీభవించలేక పోయారు ఇటువంటి పరిస్థితే తర్వాతకాలంలో డా అంబేద్కర్ ''బుద్ధుడు-ఆయన ధర్మం'' విషయంలో తలెత్తింది ఆయన కూడా ప్రొఫెసర్ లక్ష్మీనరసు పరిశీలనా పద్ధతి (Methodology) నే దాదాపు ''బుద్ధుడు-ఆయన ధమ్మం'' అనే గ్రంథరచనలో ఉపయోగించుకున్నారు బౌద్ధ ధర్మాన్ని అర్థం చేసుకొనడంలో, వ్యాఖ్యానించడంలో ప్రొఫెసర్ లక్ష్మీనరసు అభిప్రాయాలతో నాటి మహాబోధి సొసైటీ వారు కాని థేరవాద బౌద్ధులు కాని విభేదించినా, ఆయన్ని ఒకగొప్ప బౌద్ధుడిగానే వారు పరిగణించారు, గౌరవించారు ఆయన రచనల్లో ఒకటైన ''వాటీజ్ బుద్ధిజం?'' (బౌద్ధం అంటే ఏమిటి?) గ్రంధాన్ని ప్రచురించారు ఈ గ్రంథం జపాన్ భాషలోకి అనువదించబడి, ఆ భాషలో పద్నాలుగుసార్లు పునర్ముద్రణ పొందింది ఒక మంచి బౌద్ధుడిగా ఆయన ఆదర్శవంతమైన జీవితం గడిపారు తనకుటుంబ సభ్యులను కూడా బౌద్ధ ధర్మావలంబికులుగా మార్చారు ఆయన రెండో భార్య బౌద్ధ ధర్మ అనుచరురాలుగానే ఆయన మరణానంతరం కూడా జీవించారు ప్రొఫెసర్ లక్ష్మీనరసు జన్మతః ''ఆదివెలమ'' జమీందారీ కుటుంబంలో పుట్టడంవల్ల వ్యక్తిగత జీవితంలో ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొన్నారు తమకులం నుండి వెలివేయబడ్డారు అయినా ఆయన చలించక తాను నమ్మిన సిద్ధాంతం కోసం, దళితుల అభ్యున్నతికోసం జీవితాంతం నిలబడ్డారు ఆలోచనలో, ఆచరణలో వైరుధ్యం ఎరుగని వ్యక్తి ఇటువంటి ఉన్నతమైన సంస్కారప్రియుడు, శాస్త్రీయ దృష్టి కలవాడు కనుకనే తర్వాత కాలంలో డా అంబేద్కర్ నవబౌద్ధ ఉద్యమాన్ని ప్రభావితం చేయగలిగారు డా అంబేద్కర్‌కు ఆయన ఒక ఆదర్శంగా మిగిలిపోయారు మహాబోధి సొసైటీ వారికంటె ప్రొఫెసర్ లక్ష్మీనరసు మతం మార్పిడి (Conversion)లో, దళిత వర్గాలలో బౌద్ధాన్ని ప్రచారం చేయడంలో ఎక్కువ ఆసక్తి చూపారు మహాబోధి సొసైటీవారు బౌద్ధాన్ని కేవలం ఒక మతోద్యమంగా, హైందవంలో అంతర్భాగంగా పరిగణించి ప్రచారంచేస్తే, ఆయన దాన్ని హిందూమతానికి, ఇతర మతాలకు ప్రత్యామ్నాయంగా, కులరహిత సామాజిక సంస్కరణోద్యమంగా భావించి ప్రచారం చేశారు

డా అంబేద్కర్‌పై ఆయన ప్రభావాన్ని అమెరికన్ పరిశోధకురాలు ఎలియనార్ జెలియట్ ఇలా పేర్కొన్నారు'' . The earlier Tamil writer was certainly an influence on Ambedkar and an example to him" (తొలి తమిళ రచయిత డా అంబేద్కర్‌పై నిశ్చయంగా ఒక ప్రభావం, ఆయనకు ఒక ఆదర్శం) ఇక్కడ తమిళ రచయిత అంటే ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు ఆయన తమిళంలో గ్రంథరచన చేశారు అందువల్ల ఆయనకు తెలుగువాడిగా కంటే తమిళ రచయితగా పేరువచ్చింది ఆమె అన్నట్టు తొలి ''తమిళ'' రచయిత లక్ష్మీనరసు డా అంబేద్కర్‌ను ప్రభావితం చేశారు కేవలం ప్రభావం చూపడమే కాదు డా అంబేద్కర్‌కు ఆయన ఒక ఆదర్శంగా నిలిచిపోయారు అంతేకాదు ప్రొఫెసర్ లక్ష్మీనరసు రచనలు, ఉపన్యాసాల ప్రభావంతో బ్రాహ్మణేతర ఉద్యమ నాయకులైన పెరియార్, అన్నాదురై వంటివారు బౌద్ధాన్ని అభిమానించి, ఆ మతం గొప్పతనాన్ని, విశిష్టతను వివరిస్తూ తమిళంలో రచనలు చేశారు పెరియార్, లక్ష్మీనరసు ఇద్దరూ కలిసి బ్రాహ్మణేతర ఉద్యమంలో హేతువాద ఉద్యమంలో పనిచేశారు దక్షిణ భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత సింగారవేలు చెట్టియార్‌తో కలిసి ఆయన బౌద్ధ ధర్మ ప్రచారంలో పాల్గొన్నారు సింగారవేలు కమ్యూనిస్టు ఉద్యమంలో అగ్రస్థానంలో వుండికూడా బౌద్ధాన్ని ఒక గొప్ప ప్రజా ఉద్యమంగా భావించి, లక్ష్మీనరసు రచనల ప్రభావంతో కమ్యూనిస్టు సిద్ధాంతవేత్తగానే దాన్ని అభిమానించారు బ్రహ్మ సమాజంలో ముఖ్యుడు, యుగకర్త వీరేశలింగం గారి ప్రియశిష్యుడు దేశిరాజు పెదబాపయ్య జీవితంపై ప్రొఫెసర్ లక్ష్మీనరసు సంస్కరణభావాలు చెరగని ముద్రవేశాయి ఆయన ప్రభావంతో మద్రాసు క్రైస్తవ కళాశాలలో విద్యార్థిగా వున్నప్పుడే పెదబాపయ్య బ్రహ్మసమాజ ఉద్యమంలో క్రియాశీలంగా పాల్గొన్నారు ఈవిధంగా 1930 సంవత్సరానికిముందే మద్రాసు ప్రెసిడెన్సీలోని అనేక ప్రజా ఉద్యమాల్ని, సంస్కరణోద్యమాల్ని ప్రభావితం చేయడమే కాకుండా, ఆ ఉద్యమాలతో ఏదో రూపంలో సంబంధాలు పెట్టుకున్నారు ప్రొఫెసర్ లక్ష్మీనరసు అప్పటికే బౌద్ధ ధర్మాన్ని భౌతికవాద దృష్టితో వ్యాఖ్యానించి, గ్రంథరచన చేసి ఆనాటి ప్రగతిశీల భావాలు కలిగిన వారందరినీ, వా రే ఉద్యమంలో ఉన్నప్పటికీ ప్రొఫెసర్ లక్ష్మీనరసు ప్రభావితం చేశారని చెప్పవచ్చు అప్పటి బ్రహ్మ సమాజ ఉద్యమం, మహాబోధి సొసైటీ నాయకత్వంలోని నవ బౌద్ధ ఉద్యమం, బ్రహ్మణేతర ఉద్యమం, కమ్యూనిస్టు ఉద్యమాలపై ఆయన జీవితం, రచనల ప్రభావం ఏదోమేరకు కనిపిస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు అంతటి మహనీయుడు మన తెలుగువాడు కావడం నిజంగా గర్వించదగ్గ విషయం

★ ఈ వ్యాసం రాసిన తర్వాత ఈమధ్య (17-05-95) ప్రొఫెసర్ లక్ష్మీనరసు రెండో భార్య కుమార్తె శ్రీమతి ఏ జి రంజని గారిని కలవడం తటస్థించింది ఆమెకు తమ నాన్నగారిని గురించి ఏమీ తెలియదనే చెప్పాలి ప్రొఫెసర్ లక్ష్మీనరసు మేధాపరమైన కృషి గురించి తెలియకపోయినా, ఆయన వ్యక్తిగత జీవితం, ముఖ్యంగా బౌద్ధుడిగా మారిన తర్వాత ఆయనపడ్డ బాధలు, ఇబ్బందులు తమ తల్లిగారు చెప్పగా విన్నవి తెలియజేశారు శ్రీమతి ఏ జి రంజని గారి గురించి తెలియజేసిన మహాబోధి సొసైటీ (మద్రాసు) బాధ్యులు శ్రీ రతనపాలగారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను

### సంప్రదించిన రచనలు:


1 THE MAHA BODHI, AUGUST ISSUE, VOL 42, NO 8, 1934

2 BUDDHISM IN SOUTH INDIA-D C AHIR, SRI SATGURU PUBLICATIONS, DELHI, 1992

3 WHAT IS BUDDHISM - PROF P LAKSHMI NARASU, MAHABODHI SOCIETY OF INDIA, CALCUTTA, THIRD EDITION, 1964

4 THE INDIAN REDISCOVERY OF BUDDHISM (1855-1956), ELEANOR ZELLIOT, STUDIES IN PALI BUDDHISM, B R PUBLISHING HOUSE, DELHI, 1979

# ఇస్మత్ చొగ్తాయి

-యస్. సదాశివ

మృణాల్‌సేన్, హృషీకేశ్ ముఖర్జీ కొన్ని మంచి సినిమాలు తీసి ''గరమ్‌హవా'' అనే ఇంకో మంచి సినిమా తీయబోతున్నారు అందులో ఒక వృద్ధమహిళ పాత్ర వున్నది. చిన్నపాత్రే కాని విశిష్టమైంది. ఆ పాత్రను సృష్టించిన ఇస్మత్ ఆపా చేతనే ఆ పాత్ర వేయించాలనుకున్నారు వాళ్లిద్దరూ. ఆమె ఇంటికి వెళ్లినారు అప్పుడామె వయస్సు డెబ్బైయేళ్లు దాటింది. తెల్లని ముగ్గుబుట్టలాంటి తల, ఖద్దరు చీర దళసరి కళ్లద్దాలు వాటిల్లోంచి ఎదుటివాళ్లను శోధిస్తున్నట్లు చూచే నిశితమైన చూపులు మాటలో దురుసుతనం మనసు నిండా మమకారం ఆమె పేరు ఇస్మత్ చొగ్తాయి. అంతా ఆమెను 'ఆపా' అని పిలిచేవాళ్లు ఆపా అంటే అక్క 'గరమ్‌హవా' రచయిత్రి ఆమే అలా వెళ్లిన ఆ యిద్దరు సినీ నిర్మాతలు ''ఆపా! ఆవృద్ధ మహిళ పాత్ర మీరు పోషిస్తే చాలా గొప్పగా వుంటుంది'' అని విన్నవించుకున్నారు. ఆమె ఆశ్చర్యంతో నోరంతా తెరిచి ''ఏమిటీ! ఈ వయసులో నేను ముఖానికి రంగు పూసుకొని కెమెరా ముందు నిల్చోనా? ఇంట్లో ఇద్దరు ఎదిగిన అమ్మాయిలున్నారు ఎవరేమయినా అనుకోరా?'' అన్నది. పెద్దల ముందర నవ్వటం మర్యాదకాదని తెలిసినా ఆ యిద్దరూ నవ్వాపుకోలేక పోయినారు. ఆమె ఇంకా ఆశ్చర్యపడి ''ఇందులో నవ్వేందుకేమున్నది? అలా నవ్వుతారెందుకు?'' అని అడిగింది. వాళ్లు నవ్వాపుకొని ''ఆపా! ఇన్నాళ్లకు మీలో ''ఎవరేమనుకుంటారో!'' అనే ఆలోచన కలిగినందుకు నవ్వక మరేం చేయమంటారు?'' అన్నారు అలా ఆలోచించినందుకు ఆమె నిజంగా సిగ్గుపడ్డది ''ఆపాత్ర నేను నటిస్తాను'' అని హామీ యిచ్చి పంపింది చక్కగా నటించింది

ఆమె యూనివర్శిటీ చదువు ముగిసీ ముగియక ముందే అప్పటి ప్రసిద్ధ పత్రికలకు తన కథలు పంపింది ఆ కథలు అచ్చవగానే సమాజంలో పెద్ద సంచలనం బయల్దేరింది ముఖ్యంగా ''లిహాఫ్'' అనేకథ ఘరానా కుటుంబాల్లో జరిగే అశ్లీల అసభ్య వ్యవహారాల మీది తెర తొలగించిన కథ. అశ్లీలతను, అసభ్యతను అసహ్యించుకునే పెద్దలు అది బయటికంటే తమలోనే బాగా వున్నదని తెలుసుకొని గాభరాపడ్డారు

అలాంటివే మరికొన్ని కథలు మర్యాదస్తులు పరువునష్టం దావాలు వేసినారు. ఆకాలంలో అనేక కథలకు గాను కోర్టుకీడ్వబడిన రచయిత సాదత్ హసన్ మంటో అయితే అతడు మగవాడు. ఈమెగొప్పింటి ఆడపడుచు, కలెక్టర్‌గారి అమ్మాయి, బాగా చదువుకున్నది; అలాంటి ఇతివృత్తాలను కథా వస్తువుగా గ్రహించటాన్ని సమాజం పెద్దలు సమ్మతించలేక పోయినారు. పురుషాధిక్య సమాజంలో తమ మాటే చెల్లుబడి అవుతుందని నమ్ముతూ వచ్చిన పురుష పుంగవులు రంకెలు వేసి రాద్ధాంతం చేసినారు బురఖాలలో వుండే ఘరానా స్త్రీలు బుగ్గలు నొక్కుకున్నారు ముక్కున వేలేసుకున్నారు. కానయితే ఆమె స్త్రీలకు జరిగే అన్యాయాలనే చిత్రించింది కానీ స్త్రీలే ఆమెకు ''బరితెగించిన ఆడది'' అనే బిరుదప్రదానం చేసినారు. ఇంటివాళ్ళూ ఈసడించుకున్నారు అయినా ఆమె ఖాతరు చేయలేదు. ''ఎవరేమనుకుంటే నాకేమి?'' అనే ధోరణిలో రాస్తూ పోయింది అలాంటి ఇస్మత్‌చొగ్తాయి నోట ''ఎవరేమంటారో!'' అనే మాట విని ఆ సినిమా నిర్మాతలిద్దరూ నవ్వాపుకో లేకపోయినారు సిగ్గెరుగని ఆమె తన ఆలోచన అలాసాగినందుకు జీవితంలో మొదటిసారి సిగ్గుపడ్డది.

ఆమె కుటుంబం జోధ్‌పూర్‌కు చెందింది ఆమె తండ్రి కలెక్టర్‌గా చాలా నగరాల్లో పనిచేసినాడు. అతని పిల్లల చదువులు అల్లాబాద్‌లోను, ఆలీగఢ్‌లోను సాగినవి అతని పెద్దకొడుకు, అంటే

ఇస్మత్ చొగ్తాయి పెద్దన్న అజీంబేగ్ చొగ్తాయి అలీగఢ్ యూనివర్శిటీ నుండి లాడిగ్రీ పుచ్చుకొని ప్రాక్టీసు ప్రారంభించినాడు అతని ఆరోగ్యం మొదటి నుంచి అంతమంచిది కాదు కొన్నాళ్లకతనికి టి బి అని తేలింది అప్పట్లో ఆ వ్యాధికి తగిన చికిత్సా సదుపాయాలు లేకుండేవి అతడు అధిక సమయం మంచంలోనే గడిపినాడు కాబట్టి పడుకొని పడుకొని విసుగుపుట్టినప్పుడల్లా ఏదో రాస్తుండేవాడు అతనిపట్ల అంతా జాలి చూపేవాళ్లు కనుక ఆరోగ్యంగా ఉల్లాసంగావుండే వాళ్లపట్ల అతనికొక రకమైన కసియేర్పడింది అందరిని నొప్పించే మనస్తత్వం అలవడింది అతని రచనల్లో ఆ మనస్తత్వం వ్యంగ్యాత్మకంగానూ, హాస్యాత్మకంగానూ వ్యక్తమయ్యేది అతని వ్యంగ్యం కేవలం నొప్పించటానికి కాదు అతని హాస్యం కేవలం నవ్వించటానికి కాదు సంస్కారవంతుడూ, విద్యాధికుడూ కనుక అతని రచనలు సామాజిక స్పృహతో చేసినవే ఆలోచింపజేసేవే అందుకే ఈనాడు కూడా అతని రచనలు పఠితులను హాయిగా చదివిస్తాయి ఆలోచింపజేస్తాయి. అతని నవలలూ, కథాసంకలనాలూ ఇరవై

ఇస్మత్ చొగ్తాయి బి ఎ, బి టి చేసి విద్యా శాఖలో ఉద్యోగం సంపాదించింది అజీంబేగ్ అచ్చయిన తన ప్రతికథను ఇంటి వాళ్లందరికి వినిపించేవాడు ఇస్మత్ చొగ్తాయి రచయిత్రి కావటానికి ఆమె అన్నగారే కారకుడు అయితే అజీంబేగ్‌కు తన సోదరి రచనలపట్ల ఎలాటి అభిప్రాయం వుండేదోకాని పైకి మాత్రం ఎన్నడూ ప్రశంసించలేదు పైపెచ్చు సిగ్గులేని రచనలు చేస్తున్నందుకు మందలించేవాడు

ఇస్మత్ చొగ్తాయి మధ్య తరగతి ముస్లిముల జీవితాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసింది ఆమెకూడా ఆ వర్గంలోంచి వచ్చిందేనాయె వాళ్ల సామాజిక, నైతిక, ఆర్థిక, సైద్ధాంతిక సమస్యలే ఆమె కథలకూ నవలకూ ఇతివృత్తాలు లైంగిక సమస్యల్నీ కూడా ఆమె స్పృశించకుండా వదిలి పెట్టలేదు ఏది చెప్పినా నిర్భయంగా నిస్సంకోచంగా, నిజాయితీతో చెప్పింది ఆమె కథల్లో వాస్తవికత వుంటుంది అందుకే ఆమె మీద వేసిన పరువునష్టం దావాలేవీ నెగ్గలేదు లైంగిక సంబంధాలను చిత్రించేటప్పుడు అశ్లీలతను, అసభ్యతకు ఆస్కారం వున్నది కాని ఆమె అసభ్యమైన వాక్యంకాదు గదా అసభ్యమైన శబ్దాన్ని కూడా ప్రయోగించలేదు సందర్భానికి తగిన సబలమైన, సశక్తమైన శబ్దాన్ని ప్రయోగిస్తూ సమాజంలోని మంచిని, చెడును గురించి కళాత్మకమైన శిల్పంతో నుడికార శోభితమైన భాషలో కథలు కథలుగా చెప్పింది ఆమె కథలను మరేభాషలోనైనా అనువదిస్తే భావం మిగులుతుంది కానీ భాషాసౌష్ఠవం మిగులదు ఆమె కథ చెప్పేతీరే అద్భుతమైంది అద్వితీయమైంది అది ఆమె ఉర్దూలోనే సాధ్యం

ఆమె పురుషాధిక్యతను, పురుషాహంకారాన్ని జీవితాంతం నిరసించింది కాని ఆమె పురుషద్వేషిణి కాదు మనసూ మానవతా ఎవరిలో వున్నా గౌరవించింది

ఆమె బొంబాయి మహానగరాన పాఠశాలల విద్యాధికారిణిగా పనిచేస్తున్నప్పుడు షాహిద్ లతీఫ్ అనే యువకునితో పరిచయమైంది అతడూ రచయితే. కాని అనామకుడు బొంబాయి సినీ జగత్తులో పరిభ్రమిస్తూ తాను రాసిన కథలను కారుచౌకగా అమ్ముకుంటూ తిరిగేవాడు కొందరు నిర్మాతలు, డైరెక్టర్లు అతని కథలు తీసుకొని ఎవరిచేతనో మార్పించి సినిమాలు తీసేవాళ్లు కొన్నికొన్ని భాగాలు రాయించేవాళ్లు సంభాషణలు రాయించేవాళ్లు. ఏదోకొంత అతని చేతిలో పెట్టేవాళ్లు అతని నెలసరి ఆదాయం మూడు వందలకు మించేది కాదు ఇస్మత్ చొగ్తాయి రచనలు చదివినాడా యువకుడు ఆమె కీర్తినీ, అపకీర్తినీ విన్నాడు వెళ్లి ఆమెతో పరిచయం చేసుకున్నాడు తన రచనలామెతో దిద్దించుకునేవాడు సలహాలు తీసుకునేవాడు సాహిత్య చర్చ చేసేవాడు ఆ సాహిత్య పరిచయం కొన్నాళ్లలాగే సాగింది ఉండి నిలిచి ఆ యువకునికి ఏమితోచిందోయేమో ఒకనాడు ''ఇస్మత్ మనిద్దరం పెళ్ళి చేసుకుందామా?'' అన్నాడు ఆశించని ఆ ప్రస్తావనతో ఆమె

అదిరిపడింది ఆమేమో గజిటెడ్ ఆఫీసర్ ప్రఖ్యాత రచయిత్రి అతడేమో నికరమైన ఆదాయం లేని నిరాశ్రయుడు ''చూడు షాహెద్! నువ్వు బుద్ధిమంతుడివి, మంచివాడివి. నీకు తగిన అమ్మాయిని పెళ్లి చేసుకొని సుఖపడితే చూచి సంతోషిస్తాను మన అంతస్తుల గురించి మాట్లాడటంలేదు స్వభావాల గురించి మాట్లాడుతున్నాను. నీభార్య ఎలా వుండాలో నీకు కొన్ని అభిప్రాయాలుంటాయి నేను నీకు తగిన భార్యను కాలేను పురుషాహంకారాన్ని సహించటం నా స్వభావం కాదు సతీసావిత్రిలా పతిసేవ చేసే దాన్ని కాను. నన్ను చేసుకొని నువ్వేమి సుఖపడతావు? బ్రతికినంతకాలం పశ్చాత్తాపపడతావు నీవుద్దేశం మార్చుకో'' అని బడిపిల్లవానికి చెప్పినట్లు నచ్చచెప్పింది అయినా, అతడు ఆమె దగ్గరికి రావటం మానుకోలేదు పెళ్లిప్రస్తావన తేవటం మానుకోలేదు ఈ సంగతి ఇస్మత్ ఇంటివాళ్లకు తెలిసింది ఆమె అన్న కోర్టు పనిమీద బొంబాయికి వచ్చి చెల్లెలి దగ్గర షాహెద్ లతీఫ్‌ను చూచినాడు అతడు వెళ్లిపోయిన తర్వాత ''ఏమే రాక్షసీ! ఆ కుర్రాడు అమాయకుడు బుద్ధిమంతుడు నిన్ను కట్టుకొని ఏమి సుఖపడతాడే! అలాంటి వాని వెంట పడ్డావేమి? వదిలిపెట్టు'' అని మందలించినాడు ''నేనేమీ వెంటపడలేదు అతడే పడ్డాడు ఎంతచెప్పినా వినడు నువ్వయినా బోధించి పుణ్యం కట్టుకో'' అని బతిమాలిందామె. ఎందరు నచ్చచెప్పినా, ఎందరు బోధించినా షాహిద్‌లతీఫ్ తన అభిప్రాయం మార్చుకోలేదు. వాళ్లిద్దరి పెళ్లి జరిగింది గతిలేనివాడు గజిటెడ్ ఆఫీసర్ భర్త అయినాడని అతని మిత్రులు అపహాస్యంచవచ్చుననే భావంతో ఇస్మత్ తన ఉద్యోగానికి రాజీనామా చేసింది రచయిత్రిగా తన కీర్తిప్రతిష్ఠలు భర్తలో న్యూనతా భావాన్ని కలిగించ వచ్చునని రచనా వ్యాసంగాన్ని కట్టిపెట్టింది. వాళ్లిద్దరు కలిసి నడుస్తూ వుంటే వెనుకనుంచి ఎవరో అన్నారట, ''ఇద్దరి ఎత్తు సమానమే!'' అని. మర్నాటినుంచి హైహీల్డ్ షూస్ వేసుకోవటం మానుకున్నది సతీసావిత్రి లాంటి దాన్ని కాను అని చెప్పిన మనిషి! ప్రొడ్యూసర్ల చుట్టు చక్కర్లు కొట్టే లతీఫ్‌నే ప్రొడ్యూసర్‌గా చేసి తాను రాసిన ''జిద్దీ'' నవలను, ఇతర కథలను మంచి ఫిల్ములు తీయించింది ఆ ఫిల్ములకు స్క్రీన్‌ప్లే, డైలాగ్స్ మొదలయినవి ఆమే రాసేది పేరు షాహిద్‌ది నిర్వహణ అంతా ఇస్మత్‌ది వాళ్ల సినిమాలకు మంచి మార్కెట్ దొరికింది దేవానంద్, నిమ్మి, దిలీప్‌కుమార్, కామినీ కౌశల్ లాంటి ఆనాటి మేటి తారలు నటించినారు వాళ్ల ఫిల్ముల్లో. ఆర్థికంగా, సామాజికంగా స్థిరపడ్డారా దంపతులు వాళ్లది సుఖసంసారం. ఇద్దరమ్మాయిలు కలిగిన తర్వాత షాహిద్ లతీఫ్ మరణించినాడు మరణించటానికి కొన్నిరోజులు ముందు ''నన్ను చేసుకుంటే బ్రతికినంత కాలం పశ్చాత్తాపడతావన్నది ఇస్మత్ నాకటువంటి అవకాశమే కలిగించలేదు. నన్ను కట్టుకొని ఏమి సుఖపడతావు అన్నది కాని నేను పొందిన సుఖం, నేను పొందిన గౌరవం ఏకొద్ది మంది భర్తలో పొందగలరు '' అని తన డైరీలో రాసుకున్నాడు

షాహిద్ అకాల మరణం వలన ఇస్మత్ చొగ్తాయి బాధ్యతలు పెరిగినవి అమ్మాయిలను చదివించాలె. పెళ్లిళ్లు చేయాలె. మళ్లీ రచయిత్రిగా మారింది. ''మేము ముస్లిములమైనా మామూలాం భారతదేశంలోనే వున్నది. కాబట్టి నా అమ్మాయిల చేత భారతరామాయాణాలు, భగవద్గీత చదివించినాను '' అని ఒకచోట రాసిందామె

అమృత్‌లాల్ నాగర్ హిందీలో గొప్ప రచయిత అతడు భంగ్ ప్రియుడు భంగ్ నూరించి త్రాగటమేకాక పాన్ బీడీలలో కూడా భంగ్ పొడి కలుపుకొని నమిలేవాడు. ప్రతి సంవత్సరం హోలీ పండుగనాడయితే అతనింట్లో భంగ్ తయారీ ఒక యజ్ఞంలాగా జరిగేది తనకు సన్నిహితులైన కొందరు హిందీ ఉర్దూ కవులను ఆహ్వానించేవాడు ఇస్మత్ ఆపా అతనింటికి సాధారణంగా వెళ్లేది కాని హోలీనాడెన్నడూ ఆమెను ఆహ్వానించలేదు ఒక హోలీ పండుగకు ఆమెనూ ఆహ్వానించాడు తాను జగమెరిగిన రచయితే అయినా తన తాజా కథల సంకలనానికి ఆపా చేత ప్రస్తావన రాయించాలన్నది అతని బహుకాలవాంఛ ఆపా ఒప్పుకున్నది కానీ అక్కడందరూ భంగు తాగుతుంటే తానూ తాగుతానని పట్టుపట్టింది ''ఆపా! అది మీ వొంటికి పడదు.'' అని నాగరేకాక

అక్కడున్న వాళ్లంతా మనవి చేసినారు ''అంటే మీరంతా మగవాళ్లు మీ వొంటికి పడుతుంది నేను స్త్రీని నా వొంటికి పడదు ఈ దౌర్భాగ్యపు ఆలోచన మీకు అన్ని విషయాల్లోనూ వుంటుంది నాకిప్పుడు భంగు కావాలె '' అని హఠం చేసింది ఆమెను వారించటం ఎవరి తరం కాదు కాబట్టి అంతా తలో భంగు గ్లాసు తీసుకుని, ఆమెకు భంగులేని చిక్కని పాల గ్లాసిచ్చినారు ఒకటి తర్వాత ఒకటి, మూడు గ్లాసులు తాగింది అంతా నవ్వుతున్నారు తుళ్లుతున్నారు తూలుతున్నారు వదురుతున్నారు తనకేమీ కావటం లేదు ''నాగర్! నాకు ధోకా చేసినావు గదా! భంగని చిక్కని పాలు తాగించినావు ధూర్తునివి అబద్ధాల కోరువు '' అని కోప్పడింది ఆపా ఆ కోపంలోనే ''నీ కధకు సంకలనంతే - ఇప్పుడు అభిప్రాయం రాస్తా'' అన్నది రాసింది భంగు ప్రహసనమంతా రాసి ''ఈ అమృత్‌లాల్ నాగర్ ఎంత గొప్ప నవలలు రాసినా, ఎంత కధలు రాసినా ధూర్తుడు అబద్ధాల కోరు కాని ఇతని కలం మాత్రం సత్యం తప్ప తదన్యం రాయ జాలదు'' అని ముగించింది. అది సర్టిఫికెటె

ఆమె, తన అన్న అజీంబేగ్ చొగ్తాయి చావును గురించి చెప్పిన కధ ఉర్దూ కధా సాహిత్యంలో ఉత్కృష్టమైందని విద్వాంసుల అభిప్రాయం మొదటి నుంచి చివరి వరకు, చివరి ఒక చిన్నవాక్యం తప్ప, తన అన్న కుటుంబ సభ్యుల నెలా హింసించి బంధించి ఆనందించేవాడో, తామందరికి అతని పట్ల ఎంతటి విరక్తి కలిగిందో చెప్తుంది అన్నను గురించి చెల్లెలు చెప్పినట్లుగా వుండదు ఇష్టంకాని వ్యక్తి గురించి ఇష్టం లేనట్లు చెప్పినట్లుగా వుంటుంది బన్నేభాయి అని వాళ్ళంతా పిలుచుకునే అజీంబేగ్ చొగ్తాయి రచయితగా గొప్పవాడు కాని క్షయవ్యాధి పీడితుడు కనుక రోగగ్రస్త మనస్తత్వం కలవాడు ఒకవైపు దగ్గుతూ, నెత్తురు కక్కుతూనే సరిగా నిద్రాహారాలు లేక పగలూ, రాత్రీ సేవచేసే భార్యను చీటికి మాటికి ఏడిపిస్తుండేవాడు దీనంగా, దిగులుగా చూస్తుంటే తల దండ్రులను సూటిపోటి మాటలతో నొప్పిస్తుండేవాడు తమ్ములను, చెల్లెండ్లను కసురుకుంటుండే వాడు ఒకనాటి రాత్రి పరిస్థితి విషమించింది డాక్టర్లు పెదవి విరిచి వెళ్లిపోయినారు అయినవాళ్ల ఆశచావదు గదా అంతా అతని మంచం చుట్టు చేరి సపర్యలు చేస్తున్నారు నిద్ర, విశ్రాంతి సరిగాలేని ఇస్మత్ రాత్రి మూడు గంటలప్పుడు ఎక్కడో ముడుచుకొని పడుకున్నది అంతలోనే చిన్నచెల్లెలు వచ్చి, ''ఆపా! లే, లే మన బన్నేభాయి మరణించినాడు'' అని లేపింది అలసట, నిద్రమత్తు, చిరాకు, చీదరగా ఆమె ఒళ్లు విరుస్తూ లేచి, ''మన బన్నేభాయి ఎక్కడచస్తాడే అతనికి చావులేదు '' అన్నది ఈ వాక్యం చీదరతో అన్నట్లున్నది కాని సుప్రసిద్ధుడైన ఒక రచయితకు అతని చెల్లెలు సమర్పించిన సాహిత్యనీరాజనమిది. దీని శీర్షిక 'దోజఖీ' అంటే నరకవాసి అని అర్ధం

డాక్టర్ రాజ్‌బహదూర్‌గౌడ్ 'సియాసత్' పత్రికలో కొన్నాళ్లక్రిందట రాసిన ఒక ముచ్చట చెప్పి ఈ వ్యాసం ముగిస్తాను ట్రేడ్ యూనియన్ లీడర్‌గా, ఉర్దూ రచయితగా రాజ్ బహాదుర్‌గౌడ్ సుప్రసిద్ధుడు

ఢిల్లీలో ఒక సాహిత్య సభ రాజ్ బహాదుర్ గౌడ్ ఆపా అతిథి ఇద్దరు కలిసి సభకు వెళ్లినారు ఆపా మాత్రం కార్యకర్తలతో మాట్లాడుతూ అలాగే కూర్చున్నది ''ఆపా! ఇక వెళ్దామా?'' అని రెండు మూడు సార్లన్నాడు డాక్టర్‌గౌడ్ ఆమె వినిపించుకోలేదు అతనిలో గాభరా మొదలయింది అప్పట్లో అపరాత్రివేళ ఢిల్లీ రోడ్లమీద స్కూటర్ ప్రయాణం ప్రమాదరహితం కాదు చివరి ప్రయత్నంగా, ''ఆపా! చూడండి మహిళలంతా వెళ్లిపోయినారు అన్నాడు ఇస్మత్ చొగ్తాయి గట్టిగా నవ్వి, ''ఓ, అదా నీభయం? ఒంటిగా మిగిలిపోయినావా? భయమెందుకు? వెంట నేనుంటానుగా'' అన్నది

''అలాటివాళ్ల ముందు పురుషాధిక్యత, పురుషాహంకారం అనే మాటలకు అర్థం లేదు'' అంటాడు డాక్టర్ రాజ్ బహాదుర్‌గౌడ్

మధురవాణి మాటకచేరి

# శృంగారం ముదిరితే ...

– సత్తెనపల్లి రామమోహన్ రావు

తొండ ముదిరితే ఊసరవెల్లి అవుతుంది అంటారు ఏది ముదిరినా మరేది అతి అయినా యిబ్బందే తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్లే మా వెంకటేశం యింకాస్త ముదిరి మరి నాలుగు బుకాయింపు మాటలు వేర్చేసుకుంటే గిరీశం అయిపోడా అనిపిస్తుంటుంది అప్పుడప్పుడూ నాకు. బోధవంట పట్టి శల్యాలకు అంటిపోయినప్పుడు గురువు శిష్యుడాయె, శిష్యుడు గురువాయె అన్నట్లే అయిపోదా? వెంకటేశం మాత్రం ఎవరి శిష్యుడు కనక? అలాగే రావప్ప పంతులు ముదిరితే, యింకా తెలివిమీరితే గిరీశం కాలేడా అని నాదో చిన్న డౌటు..

''నాకు ఇంగ్లీషే వస్తే దొరసాన్లు నా వెనకాల పరిగెత్తరా --'' అన్నాడు రావప్ప పంతులు ఒకసారి. ఆమాట నిజమే అనిపించింది నాకు -- ఇంగ్లీషు వచ్చినా పంతులుగారు ఆ భాష మాట్లాడే సొంపు చూడలేక దొరసాన్లు చెప్పులు పుచ్చుకొని వెంటపడే వుండేవారు ఆమాట అంటే ఏడ్చి పోతాడు మానవుడు అనుకొని -- మీ అందానికి మేం తెలుగువాళ్ళము చాలమో -- అంటూ ఓ సన్నాయి నొక్కు నొక్కి గురుణ్ణి ములగచెట్టు ఎక్కించాను అయినా నాపిచ్చిగాని ముదిరినా ముదరకపోయినా రావప్ప పంతులు ఎన్నటికీ గిరీశం కాలేడు మోసగాడయినా గిరీశంగారిలో వున్న చమక్ రావప్ప పంతులుకి ఎక్కడొస్తుంది ? అసలు గిరీశానికి తెలియందేవుంది కనక . చుట్టలు కాల్చటం దగ్గరనుంచి గ్రాస్ గరల్సు బ్యూటీని వర్ణించటం వరకు అన్నిట్లోను ఆయన ఘనాపాటీయే. అందుకని ఎంత ముదిరినా రావప్ప పంతులు లుబ్ధావధాన్లు అవుతాడేమోకాని గిరీశం మాత్రం కాలేడు వీళ్ళు ముదరటాల సంగతి ఎలా వున్నా శృంగారం ముదిరితే బూతు అవుతుంది అసలు బంగారం లాంటి శృంగారంలో కూడా ఎన్నో రకాలున్నాయి నాజూకు శృంగారం, మోటు శృంగారం, సభ్య శృంగారం, అసభ్య శృంగారం, స్వకీయ శృంగారం, పరకీయ శృంగారం వగైరా.. వగైరా

శృంగారంకాస్త కట్టు దాటితేకాని జనరంజకం కాదని యీనాటి కొందరు రచయితలు, సినిమా వాళ్ళు అనుకుంటున్నట్లే -- ఆరసం ముదురుపాకానా పడితేకాని ప్రభు రంజకమూ ప్రజారంజకమూ కూడా కాదని ఆనాటి కొందరు కవులు అనుకున్నారు కాబట్టే శృంగార ప్రబంధాల బదులు కొన్ని బూతు ప్రబంధాలు కూడా అవతరించాయి ''పది నీతులు పది బూతులు పది శృంగారములు గల్గు పద్యములు సభన్ జదివినవాడే యధికుడు గదరప్ప --'' అన్నాడు కుందవరపు కవిచౌడప్ప బూతు పద్యాలే అయినా. లేక అవటం వల్లనేనో యీాయన రాసిన పద్యాలు యీనాటికీ నిలిచివున్నాయి సుమతీ శతకం అట్టవేసి చౌడప్ప శతకంలోపల వుంచి కులుకుతూ చదువుకునే పెద్దమనుషుల్ని నేనెందర్నో చూశాను

మాటలు కోటలు దాటతాయి కాని చేతలు గుమ్మం దాటవు అన్నట్లు రావప్ప పంతులుకి ఒంట్లో పిసరంతయినా ఓపికలేదు కాని డాబు మాత్రం లావుగానే చేస్తాడు. కరటక శాస్త్రులు శిష్యుడికి ఆడవేషం వేసి తీసుకొచ్చినప్పుడు పంతులుగారి కళ్ళన్నీ పిల్లకాని ఆ పిల్లమీదే. ''మధురం యేమంటావు యీ పిల్లన్నే పెళ్ళి చేసుకుందునా? --'' అంటాడు. ఆ మాటలకు వొళ్ళుమండి నేను చురచురా చూస్తే -- సొగసు కత్తెలకు అలక కూడా అదో శృంగారం సుమండీ శాస్త్రులుగారూ

294 పేజీలో ...

# ★ శిశువు గా చేతులు మారిన బాల్యం

# ★ అవివాహితగా తల్లి అయిన విధివంచిత

# ★ భర్తకోర్కెపై పరాయి పురుషుని ద్వారా సంత

# ఇది కుంతి దీన గాథ వ్యాస

స్వయంగా తన ప్రేరేపణ మూలకంగా మానవుడు జీవితంలో చాలా తక్కువ పనులు చేస్తాడు ఆలోచించ కారాకు లాంటిదని అనిపిస్తుంది చాలాసార్లు మన జీవితం అన్ని విధాల ఇతరులపై ఆధారపడి ఉంటుం స్త్రీల జీవితాలు పరాధీనాలు వారి సుఖ దుఃఖాలు పూర్తిగా పురుషుల మీద ఆధారపడి ఉన్నయ్ చేసేది పుర ద్రౌపది, సుభద్ర అందరి కర్మ ఇంతే అయినా ఈ స్త్రీలు తమ జీవితాలలో అప్పుడప్పుడు సుఖశాంతులతో పెళ్ళి చేసుకున్నా, గాంధారి హస్తినాపురంలో రాచభోగాలు అనుభవించింది తన భర్తకు రాజ్యాభిషేకం జ గడిపింది దుర్యోధనుడు రాజు అయినపుడు ఆమెకు రాజమాత అనే గౌరవం కూడా లభించింది నిజానికి అంతగా వైభవాలుకూడ అనుభవించింది సుభద్ర ఏనాడు పట్టపురాణి కాలేదు కాని మొత్తంమీద ఆమె జీవి యుద్ధంలో చంపబడినా, ఆమె మనవడికి సింహాసనాధిపత్యం లభించింది చివరకు తన వంశాన్ని, తన సోదరుడి కావడం చూడ గల్గింది కాని కుంతి రవ్వంత సుఖం పొందినట్లు మనకు ఎక్కడా కనబడదు జీవితమ పురుషులతో ఆమెకు సంబంధం బాంధవ్యాలు ఏర్పాడ్డాయో, వారంతా ఆమెను తమ తమ దృష్టి

ఒకచోట ఆమె వాసుదేవుడితో 'నేను నిన్ను ఒళ్ళో కూచోబెట్టుకొని బంతులాడుకున్నాను నన్ను చిన్న కుంతిభోజునికి ఇచ్చేశా' డని అంటుంది ఉద్యోగపర్వంలోని ఈ వర్ణన బహుశః తరువాత జోడింపబడినదై వళ్ళోపెట్టుకొని ఆడించడానికి ఇతర ఆధారాలతో పొంతన కుదరడంలేదు ఆ ఘట్టం చదువుతూఉంటే, ఏదో ఒ ఉంటుంది కాని కుంతి ఎన్ని బాధలు పడ్డా, తన్నెప్పుడు దీనురాలు, హీనురాలు అనుకోలేదు ఆమె దృష్టిలో పొందింది కుంతి మాటల్లో క్షత్రియ స్త్రీ సుఖభోగాలతో జీవితం గడిచిపోవాలని ఆశించదని తోస్తుంది అ మని అనిపిస్తుంది ఆమె రొమ్ము విరుచుకొని తన జీవితం కృతార్థమైనట్లు భావించింది ఆ రకంగానే తన ఆధారంగా ఆమె సుఖదుఃఖాలను ఎంచడం ఎందుకు?

కుంతి తండ్రి శూరసేన మహారాజు. కుంతిభోజుడు ఆ వంశానికే చెందిన మరోరాజు మహాభారతంలో కు ఈ విధంగా రెండు శ్లోకాలలో చెప్పబడింది

పైతృష్వసేయాయ స తా మనపత్యాయ వీర్యవాన్ ।  
అగ్ర్య మగ్రే ప్రతిజ్ఞాయ స్వస్యాపత్యస్య వీర్యవాన్ ॥  
అగ్రజాతేతి తాం కన్యా మగ్ర్యానుగ్రహ కాంక్షిణే ।  
ప్రదదే కుంతి భోజాయ సఖా సఖ్యే మహాత్మనే ॥

- ప్రొ. ఇరావతీ కర్వే

## ...హాన్ని కన్న అర్ధాంగి

## అపూర్వ సృష్టి

...గా లోచించగా మానవజీవితం సుడిగాలిలో ...నికూడా అనిపిస్తుంది. మహాభారతంలోని ...షులూ, అనుభవించేది స్త్రీలూ! గాంధారి, ...వైభవపూర్ణంగా గడపక పోలేదు గ్రుడ్డివానిని ...ర్కపోయినా ఆమె మహారాణిలానే జీవితం ద్రౌపది ఎన్నో కష్టాలు అనుభవించింది కాని, ...తంఅంతా బాగానే గడిచింది ఆమె కొడుకు ...వంశాన్ని ఉద్ధరించిన వ్యక్తి సింహాసనాసీనుడు ...ంతా కష్టమయంగానే గడిచిపోయింది ఏ ఏ ...ట్టార.

...యస్సులోనే గుప్తదానం చేసినట్లు నా తండ్రి ...ఉం... వచ్చును ఎందుకంటే కుంతి కృష్ణుణ్ణి ...కదీ...రాలు, హీనురాలు మాట్లాడుతున్నట్లు ఒకక్షత్రియ వనిత పొందవలసినదంతా ఆమె ...ును ఆమెపట్ల జాలి పడడానికి మన మెవర ...జీవితం గడిపింది మన సుఖానుభూతులు

...ంతిని గురించి చెప్పేటప్పుడు ప్రారంభంలోనే

ప్రొ. ఇరావతీ కర్వే బర్లిన్ యూనివర్సిటీ నుంచి ఆంథ్రోపాలజీలో డాక్టరేట్ పట్టా పుచ్చుకొని పుణేలోని కర్వే యూనివర్సిటీలో ప్రొఫెసర్గా పనిచేసింది ఆమె భర్త డా దినకర్ కర్వే దక్కన్ కాలేజి ప్రిన్సిపాల్ కర్వే యూనివర్సిటీ ఆమె మామగారు మహర్షికర్వే స్థాపించిందే మధ్యప్రదేశ్, బస్తర్, ఆదిలాబాద్ గోండుల మధ్య జీవిస్తూ చాలాకాలం ఆమె వాళ్ల జీవిత విధానాలను, ఆచార విహారాలను, నమ్మకాలను, అనుబంధాలను గురించి అధ్యయనం చేసింది మొదట్లో ఆమెకు మరాఠీ సాహిత్యంలో కథకురాలిగా మంచి పేరుండేది ఆమె రాసిన 'సంపూర్తి' అనే కథకు మరాఠీ కథా సాహిత్యంలో ఇప్పటికీ గౌరవస్థానమే వున్నది మానవశాస్త్ర విదుషికనుక ఆమె సనాతన కాలం నుంచి మానవుల మధ్య వుండే సంబంధాలను, అనుబంధాలను గురించి రామాయణ భారతాలను, సంస్కృత కావ్యనాటకాలను, మరాఠీ సాహిత్యాన్ని, పాశ్చాత్య సాహిత్యాన్ని బాగా అధ్యయనం చేసి మరాఠీలోను, ఇంగ్లీషులోను పరిశోధక వ్యాసాలు రాసేది సంస్కృతం, సాహిత్యం ఆమె అధ్యయన విషయాలు కావు ఆమె అధ్యయన విషయం ఆంథ్రోపాలజీ ఆమె రాసిన విలువైన గ్రంథాలన్నీ ఆంథ్రోపాలజీకి సంబంధించినవే సాహిత్యంపట్ల ఆమెకు అభిరుచి వుండేది కథకురాలు గదా! మానవశాస్త్రానికి సంబంధించిన వ్యాసాలు గూడా కథలలాగా కమ్మగా చదివించే శైలిలో వుంటాయి ఆమె తరుచుగా అమెరికాలోని యూనివర్సిటీల్లోనూ యూరోప్లోని యూనివర్సిటీల్లోనూ విజిటింగ్ ప్రొఫెసర్గా పని చేస్తూ వుండేది. అమెరికాలోని ఏ యూనివర్సిటీలోనో మానవ సంబంధాల గురించి ఉపన్యసిస్తూ గాంధారి ప్రసక్తి తెచ్చిందట ఒక అమ్మాయి ''గాంధారి ఎవరు?'' అని అడిగిందట ఆ అమ్మాయి అమెరికాలో పెరిగినా ఆమె తల్లిదండ్రులు భారతీయులే భారతీయులు తమ సంస్కృతికి ఎంత దూరమైపోతున్నారో అని ఆమె బాధపడింది 'గాంధారి' అనే వ్యాసం మరాఠీలోనూ, ఇంగ్లీషులోనూ రాసి పత్రికలకు పంపింది తర్వాత ఒక్కొక్కటిగా చాలా వ్యాసాలు రాసింది ఆ వ్యాసాలు పెద్ద సంచలనమే రేపినవి విమర్శల వర్షం కురిసింది ఆమె దేనికీ జంకే మనిషికాదు కర్వే కుటుంబమే సంఘాన్ని ఎదిరించి సంస్కరణలు చేపట్టిందాయె మహాభారత వ్యాసాలను 'యుగాంత్' పేర తొలుత మరాఠీలో, తర్వాత ఇంగ్లీషులో ప్రచురించింది మరాఠీలో రామాయణ వ్యాసాలు కొన్ని పత్రికల్లో వచ్చినవి తన జీవితకాలంలో వాటిని పూర్తి చేయలేకపోయిందామె

ఆమె మరణించిన తర్వాత పద్మభూషణ పు. ల. దేశపాండే ఆమెను గురించి చక్కటి వ్యాసం రాశాడు దేశపాండే లాగా వ్యక్తిచిత్రాలు వేసే రచయితలు భారతీయ భాషల్లో బహుకొద్దిమందే వుంటారు అతని మాటల్లో ఆమె పురుషాధిక్యాన్ని సహించేది కాదు కాని పురుషద్వేషిణి కూడా కాదు స్త్రీ జీవితాన్ని మాతృత్వం ఎలా సార్థకం చేస్తుందో చెప్పే కథే ఆమె రాసిన 'సంపూర్తి' ఆమె చిత్రకారిణి ఒక స్త్రీ చిత్రం వేసింది ఆ చిత్రంలో జీవకళ రాలేదు లోపం ఎక్కడున్నదో గుర్తించలేకపోయింది దాన్ని అసంపూర్తిగానే వదిలి పెట్టింది రోజూ కాలేజీకి వెళ్తుంది పాఠాలు చెప్పి వస్తుంది యాంత్రికంగా సాగుతున్నట్లనిపించింది జీవితం లెక్చరర్గా ఆమె గుర్తింపబడుతున్నది ఆ గుర్తింపు సంతృప్తి కలిగించటం లేదు తాను ఎవరి మాటకూ లొంగదు తనమీద ఎవరి అధికారాన్నీ సహించదు తన కంతా దూరంగానే వుంటున్నారు ఒకనాడు కాలేజీ నుంచి ఇంటికి వస్తున్న ఆమె వెనుక కొందరు విద్యార్థులు మాట్లాడుకునే మాటలు వినిపించినవి ఆ విద్యార్థులు దూరాన తన మిత్రులతో కలిసి ఏదో చర్చిస్తున్న ఆమె కొడుకును చూపిస్తూ ''మన లెక్చరర్ ఎవరనుకుంటున్నారు? అదిగో అక్కడున్నాడే, ఆ అబ్బాయి 'ఆయి' '' అంటున్నారు 'ఆయి' అంటే అమ్మ

ఔనూ? ఇన్నాళ్లు ఆమె ఆ విషయాన్ని ఎందుకు ఆలోచించలేదు? ఆమె ఒక లెక్చరర్ మాత్రమే కాదు ఒక కొడుకుకు తల్లికూడా ఈ ఆలోచనతో ఆమె వ్యక్తిత్వానికొక 'పర్ఫెక్షన్' కలిగినట్లనిపించింది ఆమె వ్యక్తిత్వం అసంపూర్ణమైంది కాదు సంపూర్ణమయింది గబగబా ఇంటికి వచ్చి ఆ స్త్రీ చిత్రానికి కొన్ని స్ట్రోక్స్ వేసి ఆమె ముఖంలో మాతృ వాత్సల్యం ఉట్టిపడేట్లు చేసింది. చిత్రం సంపూర్తి చెందింది.

ఈ శ్లోకానికి అర్థం - ఆ శూరవీర సహృదయుడు (శూరసేనుడు) తన సంతానం జన్మించడానికి ముందే ప్రథమ సంతానాన్ని ఇస్తానని వాగ్దానం చేసి, ఆ కన్యకను బ్రాహ్మణుల అనుగ్రహాన్ని అభిలషించేటటువంటి అపత్యహీనుడయిన తన మేనత్త కొడుకు, మంచి మిత్రుడు అయిన కుంతిభోజునకు ఇచ్చేస్తాడు

ఈ విధంగా పుట్టడానికిముందే కుంతి భవిష్యత్తు నిర్ణయించబడింది. అంతకుముందు కుమారుడు పుట్టిఉంటే ఇది తప్పేది అతను తన సంతానాన్ని ఇస్తానని వాగ్దానం చేశాడు ఆయితే మొట్టమొదట కుమారుడు జన్మించి ఉంటే ఆ జ్యేష్ఠుడు రాజ్యానికి వారసుడయి ఉండేవాడు కదా ! కాని మొదట కుమార్తె జన్మించడంతో, అతనికి ఎటువంటి అభ్యంతరమూ లేకుండాపోయింది అందుచేత బ్రాహ్మణుల అనుగ్రహాన్ని అభిలషిస్తున్న తన మేనత్త కొడుకయిన కుంతిభోజున కిచ్చేశాడు. ఆ రోజుల్లో ఆడపిల్లల ప్రయోజనాలలో ఇదికూడా ఒకటి. వివాహం అయిన తరవాత ఎట్లాగో పరాయివాడింటికి పోయేది అంతకుముందు కూడా ఆమెను మిత్రుడికో, బ్రాహ్మణులకో శుశ్రూషార్థం ఇవ్వడం జరిగేది ఆ రోజుల్లో ఇదేమంత ప్రాముఖ్యం కల విషయంగా ఎంచబడేది కాదు. అంతకుముందు పురాణాల్లో కూడా దశరధుడు తన కుమార్తెను రోమపాదునికి ఇచ్చి వేసినట్లు వర్ణించబడే ఉన్నది ఈ సంఘటనను ఉద్దేశించే కుంతి ఇలా అన్నది - ''రెండవవాడి కంటబడకుండా ధనం దానం చేసివేసినట్లు నా తండ్రి నన్ను కుంతిభోజుడికి ఇచ్చివేశాడు ''

కుంతికి మరో పేరు పృధ బహుశః ఆమె బాగా లావుగా ఉండడంచేత ఈ పేరువచ్చి ఉండవచ్చు కుంతిదేశపురాజు భోజుని పుత్రిక కావడంతో 'కుంతి' అని వ్యవహరించబడసాగింది భోజుడు ఆమెను పరిగ్రహించింది కూడ ఒక పిచ్చి, కోపిష్ఠి ఋషి సేవా శుశ్రూషల కోసరం ఆ ఋషి దుర్వాసుడు అతను చాలా అనాగరికుడు అని పురాణాలు చెబుతున్నాయి వంటినిండా బట్టలు కూడా కట్టుకునేవాడు కాదు బహుశః అతని శరీరం నుండి దుర్వాసన కూడా వచ్చేదేమో! ఇదేకాక అతను చాలా కోపిష్ఠివాడనికూడా ప్రసిద్ధి. ఈతనికి సువాస (సువాసితురాలు) (ఋగ్వేదం: 10-71-4) అగు క్షత్రియకన్య సంవత్సరంపాటు సేవ చేసింది ఆతనికి ఒక్కసారి కూడ కోపం రానివ్వలేదు. అతను వెళుతూ వెళుతూ ఆమెపట్ల ప్రసన్నుడయి పుత్రప్రాప్తి కలిగించే ఒక మంత్రాన్ని ఉపదేశించాడు. మహాభారతంలో ఈ మంత్రాలకు, వాటి అనుష్ఠానానికి 'అభిచారము' (అభిచారాభి సంయుక్తమ్) అనే విశేషణం జోడించబడింది వేదాల్లో అభిచారమంత్రాలు ఎవరినైనా నాశనం చేయడానికీ, ఎవరినైనా పరాజితుణ్ణి చేయడానికీ లేక ఎవరినైనా వశపరచుకోవడానికీ ప్రయోగించబడేవి ఏ వ్యక్తిమీదనైనా వాటిని ప్రయోగిస్తే తప్పకుండా దానిప్రభావం పడి తీరుతుందని నమ్మేవాళ్లు. అభిచారమంత్రంలో అటువంటి శక్తి ఉండేదని విశ్వాసం. కుంతికి లభించిన మంత్రాల గొప్పదనమేమిటంటే కుంతి ఏ దేవతనయినా సరే ఆహ్వానిస్తే, అతను తప్పకుండా ఆమెకు వశం అవుతాడు కుంతి పసితనపు చేష్టగా సూర్యుణ్ని ఆహ్వానించింది. సూర్యుడు ఆమెను భోగించాడు ఆమెకు వెంటనే ఒక అందమయిన పుత్రుడు కలిగాడు. కన్యాత్వంలో కొడుకు పుట్టడంతో ఆమె సిగ్గుతో ఆ పిల్లవాణ్ని పుట్టగానే వదలేసింది. ఆ పుత్రుడే తరువాత 'కర్ణుడు' అనే పేరుతో ప్రసిద్ధు డయినాడు

మహాభారతంలో ఎన్నో అద్భుత విషయా లున్నాయి. కొన్నింటికి లౌకిక వ్యవహారానికి పొంతన కుదురుతుంది, కొన్నింటికి కుదరదు. మహాభారతంలోని అద్భుత సంఘటనలలో కుంతికి జన్మించిన పుత్రుడు సహజ కవచ-కుండలాలతో పుట్టడం ఒకటి. దీనికి పొంతన ఎలా కుదురుతుంది ? కుంతి ఋషికి సేవా-శుశ్రూషలు చేసింది ఈ 'సేవ' లకు అర్థమేమిటి ? ఈ సేవలకు దుష్ఫలం కర్ణుడా ? అలా అయితే సూర్యుడితో ఆ సంబంధం ఎందుకు జోడించ

బడింది ? ఈ విధమయిన సహజ (పుట్టుకతో వచ్చే) కవచకుండలాలకు అర్థమేమిటి ? కుంతి ఆ పుత్రుణ్ణి వదలివేసినపుడు అతనితో పాటు ద్రవ్యం (ధనం) కూడా ఉంచింది అలాగే కవచకుండలాలుకూడా ఉంచేసిందా ? కవచకుండలాలు అగ్రవర్ణానికీ అదీ ప్రధానంగా క్షత్రియత్వానికి గుర్తా ? విడిచి వేయబడిన బాలకుడు క్షత్రియుడని సూచించడానికే కవచకుండలాలు ఉంచివేయలేదు కదా? ఇలాంటి ప్రశ్న లెన్నో మనస్సులో కదలాడుతాయి సరే అదలా ఉండనివ్వండి ఆ అనాధ బాలుడు అధిరధ సూతుడికి లభించాడు ద్రవ్యం (ధనం) తో పాటు దొరికాడు కనుక అధిరథుడు అతనికి 'వసుషేణుడు' అని పేరు పెట్టాడు పేరులో కూడ క్షత్రియులకు తగినట్లుగా 'సేనుడు' అని పెట్టాడు దీనివల్లకూడా, కవచ కుండలాలు చూసి ఇటువంటి పేరుపెట్టి ఉండవచ్చునని అనిపిస్తుంది 'కర్ణజన్మ'కు, కవచ కుండలాలకు ఎటువంటి స్వాభావికత్వాన్ని చెప్పలేము దుర్వాసమహర్షికి, సూర్యుడికి ఏమైనా సంబంధం ఉండి ఉంటే పొంతన కుదిరి ఉండేది కాని మహాభారతంలో అటువంటి దానికి ఏమీ ఆధారం కనబడడంలేదు కన్యాత్వంలో ఈ పుత్రుడు పుట్టడం ఏమిటో కాని, కుంతి జీవితాంతం ఒక మహాదుఃఖభారాన్ని - కడుపుచిచ్చును-భరించవలసి వచ్చింది ఒకసారి వదలివేసిన తరువాత ప్రత్యక్షంగా అతణ్ణి చేరదీయలేదు కదా! పెద్దవాడయిన తరువాత జన్మరహస్యమంతా చెప్పినా కూడా కర్ణుడు తన తల్లి చేసిన దురాగతాన్ని మర్చిపోలేకపోయాడు, తల్లిని క్షమించలేక పోయాడు కాని కుంతి పుట్టుకనుండి చావుదాకా తను అతనికి జన్మనిచ్చిన పాపానికీ, వదలిపెట్టివేసిన అన్యాయానికీ, ప్రతిక్షణం ప్రతిఫలాన్ని అనుభవిస్తూనే ఉంది.

ఒక తండ్రి ఆమెను దత్తు ఇచ్చేశాడు, దానివల్ల ఆమెకు ఈ కష్టం కలిగింది రెండవ తండ్రి ఆమెను ఒక వికలాంగుడి కిచ్చి పెండ్లిచేశాడు ఈ రెండవ కష్టం ఆమెను జీవితాంతం అంటిపెట్టుకునే ఉన్నది

పాండురాజుకు రాజ్యాభిషేకం జరగ్గానే కుంతి హస్తినాపుర రాజ్యానికి మహారాణి అయింది కాని మొత్తం మహాభారతంలో ఆమె నోటివెంటనే చిట్టచివర్లో ఒక్కసారి ఈ విషయం ఉటంకించబడింది అభిషిక్తుడు కాగానే పాండురాజు దిగ్విజయం చేశాడు తనకు లభించిన కప్పాలు, కానుకలు, రత్నాలు, సొమ్ములు అన్నీ ధృతరాష్ట్రుడికి అప్పజెప్పి, హిమాలయాలకు వెళ్లిపోయాడు అతనివెంట కుంతి, మాద్రి కూడా వెళ్ళారు. హిమాలయాల్లో రాజభోగాలతో గడిపారేమో కాని హస్తినాపురంలో రాణీ పదవి ఎక్కడ ? హిమాలయాల్లో అరణ్యవాస మెక్కడ ?

కౌరవులకు వేట అంటే మహాఆసక్తి, అందుచేత వాళ్ళు తరుచుగా అడవులకు వెళుతూ ఉండేవారు. వారి భార్యలు రాజధానీ నగరాల్లోనే ఉండి పోయేవారు అందుచేతనే శకుంతల దుష్యంతుణ్ణీ, సత్యవతి శంతనుణ్ణీ తమ వశం చేసుకోగలిగారు పాండురాజు యౌవనావస్థలోనే వనాల్లో నివసించడానికి ఎందుకు వెళ్ళాడు ? తను బ్రతికి ఉండగా, తన రాణులకు ఇతరుల ద్వారా పుత్రులు కలిగించే యుక్తి రాజధానిలో ఉండగా చేయడానికి వీలుపడదనా ? అరణ్యంలో ఉండగా పుత్రులంతా 'దేవదత్తులే' అయారు ఇది రాజధానిలో వీలుపడి ఉండకపోవచ్చును అరణ్యానికి పోగానే పాండు రాజుకు శాపం తగిలిందని మహాభారతం చెబుతున్నది ఒకవేళ దాన్నే నిజమనుకున్నా, ఇంత యౌవనదశలో తన ఇద్దరు భార్యలను వెంటబెట్టు కొని, అదీ దిగ్విజయయాత్ర పూర్తికాగానే అడవులకు ఎందుకు వెళ్ళాడనే సమస్యకు జవాబు దొరకడం లేదు పుత్రోత్పత్తి కూడా అతి త్వరలోనే జరిపింపబడి ఉండవచ్చును. ఎందుకంటే తను పుత్రోత్పత్తి చేయడానికి అసమర్థుణ్ణని తెలియగానే, నియోగం ద్వారా పుత్రులను పొందవలసిందని కుంతికి

చెప్పాడు ఆ సమయంలో కౌమార్యంలోనే నాకు పుత్రుడు కలిగాడని కుంతి చెప్పవలసి ఉండె ఆనాటి సంప్రదాయానికి అనుగుణంగా (క్షేత్ర బీజ న్యాయం) పాండురాజు విధ్యుక్తంగా అతన్ని తన కొడుకనే చెప్పుకొని ఉండగలిగేవాడు. అయితే ఆ సమయంలో కౌమార్యంలో తనకు గలిగిన పుత్రుడేమయినాడో ? బ్రతికే ఉన్నాడో లేదో ? అన్నసంగతి కుంతికి తెలియదు అటువంటి పరిస్థితుల్లో తనకు కౌమార్యంలో కొడుకు పుట్టాడన్న విషయం పాండురాజుకు చెప్పి ఉండకపోవడంలో ఆశ్చర్యమేమీ లేదు

ధృతరాష్ట్రునికి వివాహమయింది అతనికంటె తనకు ముందుగా పుత్రుడు కలగాలన్న అవసరాన్ని పాండురాజు గ్రహించి ఉంటాడు. కాని తను అనుకున్నదంతా తలక్రిందులయ్యేట్టు కనిపించింది ఎందుకంటె గాంధారి ముందుగా కడుపుతో ఉంది కాని మహాభారతంలో ఆమెకు కుంతి తరువాతనే పుత్రోదయం అయినట్లు చెప్పబడింది.

కుంతికి వరుసగా ముగ్గురు కొడుకులు పుట్టారు అప్పుడు రాజుతో మాద్రి ''నన్ను ప్రజలు గొడ్రాలు అంటా''రని చెప్పి ఉండాలి ''నాలో ఎటువంటి లోపమూ లేదు మీరు అక్కను అడిగి ఆ మంత్రం ఒక్కసారి - ఎందుకు ఇప్పించరు?'' అని అడిగి ఉండవచ్చు

పాండురాజు కుంతిని అర్థించాడు కుంతి ఒక్కసారి మంత్రం ఇచ్చింది మాద్రి అశ్వినీ కుమారులను ఆహ్వానించింది, కవలపిల్లలను కన్నది వాళ్లు కొద్దిగా పెద్దవాళ్ళవ్వగానే మాద్రి పుత్రోత్పత్తికై మళ్ళీ రాజును బలవంత పెట్టింది రాజు మళ్ళీ కుంతిని అర్థించాడు కుంతి మండిపడిపోయింది 'నేను పిచ్చిదాన్ని మాద్రికి కవలలు పుడతారని నాకేం తెలుసు? మళ్ళీ ఇంకోసారి మంత్రం ఇచ్చానంటే, అది ఏం జేస్తుందో ఎవడికి తెలుసు ? అలా జరిగితే దాని పలుకుబడి ఎక్కువవుతుంది ఇహ మాలో ఎవ్వరికీ పిల్లలు అక్కరలేదు ' అని అన్నది

మొదట్లోనే మాద్రికి కవలలు పుట్టివుండకపోతే, బహుశః ఇంకా కొంతమంది పాండవులు పుట్టివుండేవారు

పాపం, మాద్రి అందగత్తె, జవ్వని. కాని భీష్ముడు ఆమెను పాండురాజుకు చిన్నభార్యగా కొనుక్కొచ్చాడు రాణిపదవి దొరకడం మాట అటుంచి, ఆమె పెద్దరాణి మాత్సర్యంలో మగ్గి మసిఅయింది. ఒకరోజు ఏకాంతంలో మాద్రిని చూచి, ఆమె 'వద్దు - వద్దంటూ' ఉండగా కూడా ఆమెతో సంభోగించి, మరుక్షణాన్నే మరణించాడు పాండురాజు మాద్రి ఏడ్పు-పెడబొబ్బలు విని కుంతి పరుగెత్తుకుంటూ వచ్చింది, 'నీవు వంటరిగానే రా, పిల్లలను తేవద్దు' అన్నమాట వినగానే, పిల్లలను దూరంగా ఉండమని ఆజ్ఞాపించి కుంతి పరుగెత్తుకుంటూ ఘటనాస్థలానికి వచ్చి 'చచ్చాన్రో దేవుడా' అని అరిచింది రాజును, దగ్గరగా మాద్రిని చూచి ఆమె మాత్సర్యం పెల్లుబికింది 'నేను ఇన్నిరోజుల బట్టి కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చాను నీవు తెలిసికూడా ఇట్లా చేశావేమిటే ? రాజును రక్షించడానికి బదులు, ఏకాంతం చూసి, రాజును వళ్లో వేసుకున్నావా ? ధన్యురాలివే బాహ్లిక తనయా ! నా కంటె నీవు ఎన్నోరెట్లు ధన్యురాలివి సంభోగజనితమయిన సుఖం మూలంగా మెరిసిపోతున్న భర్తముఖం చూసే అదృష్టం నీకు కలిగిందికదా !' ఈ మాటలకు పాపం, మాద్రి ఏమని జవాబు చెప్పగలదు ? ఎలాగో ఒక లాగున 'నేను వద్దు, వద్దంటూనే ఉన్నాను' అని అన్నది. దాంతో కుంతి ఇంకా మండిపడ్డది. 'నేను పెద్దభార్యను, నేను అనుకున్నది, చేయదలచుకున్న దానినుంచి నన్ను మరల్చవద్దు నేను భర్తతోపాటు వెళ్ళిపోతాను లే! ఆయన్ని వదిలిపెట్టు ఈ పిల్లల సంరక్షణభారాన్ని వహించు,' అని గదమాయించింది

ఆ ఒక్క క్షణంలోనే ముగ్ధ అయిన మాద్రిలో ప్రౌఢత్వం వచ్చేసింది ఆ ఒక్క క్షణంలోనే ఆమెకు తన భవిష్యజ్జీవనమంతా కనిపించింది ఇప్పటిదాకా సార్థకంకాని జీవితం ఇంకాముందు ముందు దైన్యంతో కుమిలి పోగలదని అనిపించింది ఈ దైన్యాన్నుండి విముక్తికి ఏకైకమార్గాన్ని ఆమె ఎంచుకున్నది 'నేనే భర్తవెంట వెళ్ళిపోతాను నామూలానే ఆయన మృత్యువు వాతపడ్డాడు కదా! నా కోరికా నెరవేరలేదు నీవు పెద్దదానివి కనుక ఆయనతోపాటు పోవడానికి అనుమతించు నీ పిల్లలపట్ల నేను సమభావాన్ని చూపలేను నేను ఈ పాపంనుండి కూడా తప్పించుకోవాలి కుంతీ! నీవే నా పిల్లలను స్వంతపిల్లలుగా చూచుకో, సెలవు' అని అన్నది

మాద్రి రాజుతోపాటు చితి ప్రవేశించింది - సతి అయిపోయింది కుంతి చిన్నపిల్లలను, సగం కాలిపోయిన శవాలను వెంటబెట్టుకొని, ఋషులతోపాటు హస్తినాపురం చేరుకున్నది

ఇప్పుడు ఎవరిమీద జాలిపడాలి ? ఎవరిని నిందించాలి! సవతులు ఉండడం ఆ నాటి అనేకమంది స్త్రీలకు మామూలే ఆ సపత్నీత్వంలో కూడా పోటీపడి గొప్పతనం సాధిద్దామన్న తపన! కౌసల్యా - కైకేయిలు, ద్రౌపదీ - సుభద్రలు - వేయేండ్ల తరువాత కాళిదాసు చిత్రించిన ధారిణి, ఇరావతి, మాలవికలు! ఆ తరువాత ఎన్నో శతాబ్దాలు గడిచిన తరవాత ఛత్రపతి శివాజీ రాణులకు, వారి సంతానానికి మధ్య హోరా హోరి పోటీలు? సంఘంలో స్త్రీ స్థానం భర్తమీద, కుమారులమీద ఆధారపడి ఉంది కనుక భర్తకు మొదటిభార్య కావాలి; లేకపోతే అతిగా ఇష్టమయిన భార్య కావాలి పుత్రుడికి సంపదలు కూర్చిపెడదామనీ, రాజ్యంలో భాగం వచ్చేట్లు చేద్దామనే ఇన్ని అగచాట్లు ఇదే స్త్రీ నుదుటివ్రాత ! 'రా, మనం ఒకరి నొకరం ఓదార్చుకుందాం, పరస్పరం సహకరించుకుందాం' అన్న భావం ఎక్కడా కనిపించదు ద్రౌపది అర్జునుడిపట్ల కోపం వ్యక్తంచేస్తూ 'మళ్ళీ నా దగ్గరకు ఎందుకు వస్తున్నావు? సాత్వతవంశానికి చెందిన సుభద్రను తెచ్చుకున్నావుగా ఆమె దగ్గరకే పో,' అని ఈసడించుకొన్నది కాని సుభద్ర నమస్కరించడానికి వచ్చేటప్పటికి ఆమెను కౌగలించుకొని, 'దేవీ! నీ భర్త సదా విజయు డగుగాక' అని అన్నది. అయితే ఆ సమయంలో ద్రౌపది తన సవతిపట్ల ఔదార్యం చూపిస్తున్నట్లుకాదు ఆమెలో తన భర్త గొప్పతనం, గౌరవప్రతిష్ఠలను గురించిన చింతయే ఎక్కువగా కనబడుతున్నది. ఈ క్రొత్త సంబంధం చాలా ఉపయోగకరం కాగలదు అన్నభావం ఉండడంతోనే ఔదార్యాన్ని ప్రదర్శించింది

కుంతి కఠోర హృదయురాలు మాద్రిపట్ల ఆమెకు ప్రేమ ఉండడానికి అవకాశమే లేదు అయినప్పటికీ ఆమె సంతానం పొందడానికి సహాయం చేసింది దీనివలన ఆమెలో న్యాయం ఉన్నట్లు గోచరిస్తుంది మాద్రితో అంత కటువుగా మాట్లాడానికి కారణాలు ఉన్నాయి పాండురాజు బ్రతికేఉంటే, ఆ రోజు కాకపోతే రేపు హస్తినాపురం రాజ్యంపై అధికారం చేజిక్కించుకునే అవకాశం ఉండేది దాంతో ఆమె జ్యేష్ఠపుత్రుడు యుధిష్ఠిరుడు సహజంగానే రాజ్యానికి వారసుడయ్యేవాడు కుంతి పాండురాజు ఆరోగ్యాన్ని ఎల్లవేళలా అతి జాగ్రత్తగా కాపాడుకుంటూ ఉండేది. మాద్రిని ఎత్తి పొడవడంలో గల అర్థం 'నీకు అంతా తెలిసి ఉండికూడా, రాజుతో ఏకాంతంలో ఎందుకు కలిశావు?' అని మాత్రమే! కాని ఈ సందర్భంలో రాజును అయ్యో పాపం అనడం, మాద్రి నెత్తిన దోషం ఆరోపించడం అంత న్యాయసమ్మతం కాదు కాని కుంతి మనోనిబ్బరాన్ని కోల్పోయింది

మాద్రికి చనిపోవడం తప్ప వేరే గత్యంతరం లేదు తన దృష్టిలోనే గాక, రాబోయే కథ దృష్టిలో కూడా హస్తినాపురంలో సత్యవతీ, అంబాలికల వంటి అత్త అత్త, అత్త వితంతువులుగా ఉండనే ఉన్నారు వారిలో తానొకతె అవుతుంది పురుషుడితో సాంగత్యం అన్నమాట లేదుకదా ఆ సంబంధమే లేకుండా పోయింది దానికంటే హిమాలయాల్లో అరణ్య వాసమే మేలు కనుక

సహగమనం చేసి మరణించడం కంటె మాద్రికి గత్యంతరం కనబడలేదు తన నెత్తిన తప్పు పెట్టించుకొని, కుంతికి పెద్దతనం కట్టిపెట్టి, అంబవలె హా హా కారాలు చేయకుండా, సుకుమారు రాలయిన మాద్రి మృత్యు గహ్వారంలో ప్రవేశించింది

ఇక్కడినుంచే కుంతియొక్క కఠోర జీవితం ప్రారంభ మవుతుంది హస్తినాపుర మార్గంలో ఇరువైపులా బారులు దీర్చిఉన్న పౌరులు 'ఈ పిల్లలు అతని పిల్లలేకదా!' అనీ, 'అతని పిల్లలు ఎలా అవుతారు?' అనీ, 'ఆ! అతని పిల్లలే అయి ఉంటారులే' అన్నీ రకరకాలుగా చర్చలు సాగిస్తూ ఉన్నారు ఈ చర్చలు విని కుంతికి ఎలా అనిపించి ఉంటుంది? వెంట బ్రాహ్మణులు, ఋషులు ఉన్నారు పాండురాజు, మాద్రి శవాలు ఉన్నాయి భీష్ముడు అందరిని గౌరవించాడు. రాచ మర్యాదలతో పాండురాజుకు, మాద్రికి ఉత్తరక్రియలు జరిపించాడు హస్తినాపుర రాజకుటుంబములోనూ, నగరమంతా సూతకం పాటించారు దీని వలన పాండు పుత్రులకు యువరాజత్వ గౌరవం లభించింది పెత్తండ్రి పుత్రులతోపాటు వారి విద్యాభ్యాసం ప్రారంభమయింది. కుంతి హాయిగా శ్వాస తీసుకొని ఉంటుంది

కాని ఈ హాయి ఎక్కువ రోజులు ఉండలేదు క్రొత్త క్రొత్త కష్టాలు ఎదురు కాసాగినాయి. పాండవులు రాజకుమారులుగా ఎంచబడ్డారు, కాని రాజ్యానికి ఏకైక ఉత్తరాధికారులుగా వారిని గురించి ఎక్కడా ఉటంకించ బడలేదు అటు ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడు కాకుండానే రాజు అయి కూర్చున్నాడు కొన్నిసంవత్సరాలు పుత్రులు యుక్త వయస్కులయ్యేవరకు కుంతి సుఖశాంతులతో కాకపోయినా, హాయిగానే గడిపి ఉండాలి అప్పుడు కూడా పిల్లల సంరక్షణ చేస్తూనే ఉండిఉండాలికదా, పిల్లల విద్యాభ్యాసం ప్రారంభమయిన దగ్గరనుండి గొడవలు ప్రారంభమయినయి కుంతి పుత్రుడు భీముడు దుందుడుకువాడు అతను తన పెత్తండ్రి ధృతరాష్టుడి కొడుకులలో లోపాలు వెదకి, వాళ్ళను ఏడిపిస్తూ ఉండేవాడు వాళ్ళు చెట్టు ఎక్కితే, భీముడు బలంగా చెట్టు ఊపి వాళ్ళను క్రింద పడవేసేవాడు కొట్లాటలు, దెబ్బలాటలు నిత్యమూ జరుగుతూనే ఉండేవి శస్త్రాస్త్ర విద్యల్లో కూడా పాండవులు కౌరవులను మించిపోయారు భీముడే కాకుండా మిగతావారు, ముఖ్యంగా జ్యేష్ఠుడయిన ధర్మరాజు, వ్యవహార దక్షులని పేరుపొందారు ఆ గొప్పదనమూ కుంతి నేర్పిన చదువు సంధ్యలదే!

ధృతరాష్ట్రుడికి వందమంది, పాండురాజుకు ఐదుగురు, మొత్తం 105 మంది రాకుమారులు వారిలో ధర్మరాజు అందరికంటె పెద్దవాడు అంతేకాదు, అతను తెలివిగలవాడు, విజ్ఞుడు, అందగాడు, చక్కటి నడవడి గలవాడు. విశ్వాసపాత్రుడుగా రూపొందాడు కనుక అతడే రాజవుతాడు అనే నిశ్చయం, విశ్వాసం కలగడంతో పాండవులను ప్రజల దృష్టినుండీ, రాజధానీనగరంనుండీ తొలగించివేయాలని దుర్యోధనుడు, ధృతరాష్ట్రుడు ప్రణాళికలు వేయసాగారు ఉపాయంగా వారు పాండవుల్నీ, కుంతినీ వారణావతం పంపించి వేశారు లాక్షాగృహంలో సజీవంగా దహనం చేసి వేయాలన్న వారికుట్ర విదురుని ముందు జాగ్రత్తవల్ల తప్పిపోయింది ఈ సందర్భంలో కూడా కుంతి అసామాన్యధైర్యాన్ని ప్రదర్శించింది. రోజాబ్రాహ్మణసంతర్పణ పేరుపెట్టి ఆమె పురోచనుని కనుగప్పే ప్రయత్నం చేసింది పాండవులు స్వయంగా ఇంటికి నిప్పు పెట్టారు. పాండవుల బదులు దుష్ట పురోచనుడు, ఆతనితోపాటు అమాయకురాలయిన కిరాతస్త్రీ తన ఐదుగురు పుత్రులతోసహా ఆ మంటలకు ఆహుతి అయినారు. ఈ సందర్భంలో ఇది పాండవులు చేసిన దురాగతం అవునా కాదా అన్న ప్రశ్న కలుగుతుంది అయితే పాండవులు చేసిందల్లా కుట్రదారులు అయిన సోదరుల కుతంత్రాల నుండి తప్పించుకొని బయటపడడమే ఇది ఇతరుల నెవరినైనా బలి యివ్వకుండా సాధ్యపడలేదు

ఇది ఈ అధ్యాయంలో స్పష్టం చేయబడింది బహిరంగంగా యుద్ధంచేసి మరణించడానికి వారు సిద్ధులే కాని కపటంగా చంపబడడంలో అపకీర్తి మహాభారతంలో ఇతరత్రా కనబడే స్వ, పర భావం ఇక్కడ కూడ కనబడుతుంది

కల్లుత్రావి, పుత్రులతోపాటు, ఆ రాత్రి తెలివి దప్పి అక్కడ పడుకున్న స్త్రీ ఆటవికురాలు ప్రస్తుత ముద్రణలో 'అప్రయత్నంగా మృత్యువే అక్కడకు తీసుకొచ్చిందా అన్నట్లు ఒక భిల్ల స్త్రీ అక్కడికి వచ్చింది కల్లుత్రావి మత్తిల్లి పడుకున్నది ' అన్న అర్థంకల ఒక శ్లోకం ఉన్నది విభిన్న ముద్రణలలో ఉండి, ప్రక్షిప్తాలని నిరూపించబడడంతో వదలి వేయబడిన శ్లోకాల అర్థాలు ఈ విధంగా ఉన్నాయి ఒక శ్లోకంలో 'ఆ నిషాద స్త్రీ దుష్టురాలు, మరియు పురోచనుడికి విశ్వాస పాత్రురాలు' అని చెప్పబడింది ఇంకోదాంట్లో 'ఆమె దుష్టురాలు (పాపి) కుంతిపట్ల పైపై మైత్రీభావం కనపరుస్తూ ఉండేది (సఖిమానిని)' అని ఉంది వ్రాత ప్రతులను పరీక్షిస్తున్నప్పుడు, తులనాత్మకంగా ప్రక్షిప్తాలని నిరూపించబడిన శ్లోకాలు, ప్రాచీన మహాభారతానికి ఆ తరువాత దాంట్లో జోడించబడిన శ్లోకాలకు గల భేదాన్ని చక్కగా విశద పరుస్తాయి.

తరువాత జొప్పించబడిన శ్లోకాల వల్ల ఆ నిషాద స్త్రీ దుష్టురాలనీ, చంపదగినది అనే భావం కలుగుతున్నది మూల శ్లోకం పరిస్థితిని చక్కగా వివరిస్తుంది ''మృత్యువుచే ఆహ్వానించ బడ్డట్లు ఆమె అనుకోకుండా అక్కడికి వచ్చింది దాంతో పాండవుల పట్ల దుర్యోధనుడు చేసిన కుట్ర విఫలం కావడానికి అవకాశం కలిగింది'' ఈ వర్ణన స్వాభావికంగా తోస్తుంది బహుశః ఆ నిషాద స్త్రీ అక్కడ ఉండడంతో ఆ రాత్రే పారిపోవడానికి వేసిన ఎత్తు నిర్ణయించబడ్డట్లు తోస్తుంది ఐదుగురు పుత్రులతో సహా గుర్తు పట్టడానికి వీలు లేకుండా మాడి మసి అయిన ఆ స్త్రీ మర్నాడు పౌరులకు కనిపించింది దాంతోపాటు పాండవులను చంపదలచిన పురోచనుడి శరీరంకూడ కనిపించింది దీని వలన పాండవులు తగలబడి పోయారని నిరూపితం అయింది. వాళ్ళు ఒక సంవత్సరం పాటు ఎవరికంటా పడకుండా దాక్కొని బ్రతక గలగడం సాధ్యపడింది నిషాద స్త్రీ మరణం కథా సూత్రాలను జోడించే ఒక ప్రకరణం మాత్రమే.

ఇల్లు తగలబడి పోయేట్లుగా ఉంది, మనం ఇటువంటి చోట ఉండడం దేనికి ? అని భీముడు సోదరులను అడిగాడు దానికి ధర్మరాజు ఇచ్చిన జవాబు మూలంగా ఆ పరిస్థితులలో అంతకు భిన్నంగా చేయడానికి వీలు లేదన్న విషయం స్పష్టం అవుతుంది. అతను ''మనకు ఏమీ తెలియనట్లుగా ఇక్కడనే ఉండాలి మనకు సందేహం కలిగినట్లుగా పురోచనుడికి తెలిసిందంటే మనలను ఎలాగో తగలపెట్టి చంపివేస్తాడు ఇక్కడ అగ్నికి భయపడి మనం ఎక్కడికైనాదూరంగా వెళ్ళిపోతే దుర్యోధనుడు మనలను శస్త్రా స్త్రాలతో చంపివేయిస్తాడు అతనికి హస్తినాపురమనే ఒక ప్రత్యేక ప్రదేశం లభించింది కాని మనకు ఇంకా అటువంటి ప్రదేశం లభించలేదు అతన్ని సమర్థించే ఒక పక్షంకూడా యేర్పడింది మన పక్షాన ఇంకా ఎవరూ లేరు అతను ధనవంతుడు, మనం ధనహీనులం అతను మనలను తప్పక చంపించివేస్తాడు అందుకని మౌనంగా ఉండడమే మేలు, వేటపేరు పెట్టుకొని రోజూ బయటకు వెళ్ళి, ఈ లాక్షా గృహం నుండి తప్పించుకొని బయటికిపోయే మార్గం అన్వేషిద్దాం నక్షత్రగమనాన్ని అధ్యయనం చేసి దిక్కుల తీరుతెన్నులు గమనిద్దాం, ఇక్కడ నుండి బయటపడడానికి ఒక సొరంగం త్రవ్విద్దాం'' అని అన్నాడు. ఇక్కడ పాండవుల దీన పరాధీన పరిస్థితీ, కౌరవ, ధృతరాష్ట్రుల దౌష్ట్యం చక్కగా విశదమవుతుంది.

'కుంతి తన సంతానం వెంటనే ఉన్నది అతి జాగరూకతతో ఆమె వారి అన్నిపనులకూ, ప్రణాళికలకూ సహకరించింది. లాక్షాగృహం తగులబడిపోయిన రాత్రి చీకట్లో వేగంగా పరిగెత్తవలసి వచ్చినపుడు ఆమె చాలా బాధ పడింది నగరాన్ని వదలి, అరణ్యాల్లో ప్రవేశించినపుడు దట్టమయిన

చెట్ల మూలకంగా వారికి నక్షత్రాలుకూడ కనబడలేదు అడవిమార్గం, పాదా-పుత్రా-నడవడం కష్టమయి పోయింది అప్పుడు భీముడు ఆమెను తన భుజములమీద ఎక్కించుకున్నాడు చివరకు దగ్గర్లో జలచర పక్షుల కలవరం విని అందరిని ఒక చెట్టుక్రింద కూర్చోబెట్టి, భీముడు నీరు తేవడానికి వెళ్లాడు అతను తిరిగి వచ్చేసరికి అందరూ అలిసి-సొలిసి నిద్రపోయి ఉంటారు భీముడు కుంతినిచూచి 'మెత్తటి పరుపులమీద కూడ నిద్రపట్టని ఈమెకు కటికనేలమీద గాఢమైన నిద్ర పట్టింది కదా!' అని అనుకుంటాడు కాని నేలమీద పడుకోవడం కుంతికి అంత కష్టప్రదం కాదు, ఆమె తన హక్కులకై అతి జాగరూకతవహించే స్త్రీ పై పెచ్చు తన క్షత్రియత్వంపట్ల అతి గర్వంకలది కూడా ఆమెదృష్టిలో జీవితం అంటేనే సంఘర్షణ సంఘర్షణసమయంలో విచలితురాలయ్యే స్వభావం కలదికాదు ఆమె

ఆ తరువాతి యాత్రలోకూడా ఇదే కనబడుతుంది. హిడింబతో ఉండడానికి ఆమె భీముడికి అనుమతి ఇచ్చింది. ఆ కఠోర వనయాత్రలో హిడింబతో స్నేహం కుదుర్చుకుంది. ఈ హిడింబాపుత్రుడే ముందు ముందు యుద్ధంలో అతి క్లిష్టమయిన జీవన్మరణ సమస్య ఎదురయినపుడు ఎంతగానో ఉపకరించాడు బకాసురుణ్ణి వధించమని ఆమెయే భీముణ్ణి బలవంత పెట్టింది ద్రౌపది ఐదుగురికి భార్యకావలెనని ఆమెయే నిర్ణయించింది ఐదుగురిలో అంతః కలహాలు రాకుండా ఐకమత్యాన్ని స్థాపించింది ఈ వివాహానికి ముందు వారు ఒక తల్లికి ఐదుగురు పుత్రులనిపించుకునే వారు కాని అటుతరువాత మాద్రి పుత్రుల్ని విడగొట్టడానికి దుర్యోధనుడు చేయబోయే పన్నాగం పారకుండా అంతకు ముందే ద్రౌపది మూలకంగా ఐదుగురినీ ఏకసూత్రబద్ధుల్ని చేసింది ఆమె పాండవుల్ని ద్రౌపదికి ఒప్పగించి, తాను ఒక ప్రక్కకు తప్పుకుందేమోనని అనిపిస్తుంది కాని ఒక మూల కూర్చొని వ్యవహారమంతా చూసుకునే నిశ్చింతత ఆమెకు ఇంకా ఏర్పడలేదు ఆమెపెద్దకొడుకు యుధిష్ఠిరుడే ఆమెకు పరాధీనజీవితం కల్పించాడు ఈ జీవితంలో ఆమె ఎన్నో కష్టాలను అనుభవించింది జూదంలో అంతా ఓడిపోయి పాండవులు వనవాసానికి బయలుదేరినపుడు విదురుడు ఇలా అన్నాడు. 'ఆమె సుకుమారి, వృద్ధురాలు కనుక ఇహ కుంతి మీతోపాటు ఉండడం వీలుపడదు ఆమె ఇంట్లో వుంటుంది': ఈ దుఃఖ సమయంలో ఆమెకు పాండురాజు, మాద్రి జ్ఞాపకం వచ్చారు 'పాండురాజు అదృష్టవంతుడు, ఆయన పుత్ర ముఖదర్శనం బాగా చేశాడు కానీ ఈ దుస్థితిని చూడలేదు.' మాద్రి జ్ఞాపకం రాగానే ఆమెకు తన జీవితంలోని వైఫల్యం కొట్టవచ్చినట్లు కనపడింది. 'మాద్రి ధన్యురాలు, ఆమె బుద్ధిమంతురాలు, సద్గతి పొందింది. రతి, మతి, సద్గతి అన్నీ ఆమెకు లభించినాయి అన్ని విషయాల్లో ఆమె నన్ను మించిపోయింది జీవితం పట్ల నాకు గలమమకారం మూలానే నేను ఈ రోజు ఇన్ని కష్టాలు పడవలసి వస్తున్నది '' (2-7-18-20)

ఈ పదమూడు సంవత్సరాలలో ఆమె ఏమేమి కష్టాలు అనుభవించిందో, హృదయంలో ఎన్నెన్ని కోర్కెలు పెంచుకుందో అన్న విషయం మనకు ఉద్యోగపర్వంలో అర్థమవుతుంది. ద్రౌపది తన పుత్రుల్ని పుట్టింటికి పంపివేసి, ఒక రకంగా పతులతో వనవాసాన్ని స్వీకరించింది కాని కుంతి పుట్టింటికి పోకుండా విదురుడి యింట్లో ఉంటూ, రోజూ తన శత్రువుల వైభోగాలను కండ్లారా చూసేవనవాసం అనుభవించాల్సి వచ్చింది కృష్ణుడు మధ్యవర్తిత్వం స్వీకరించి, కుంతిని కలుసుకోవడానికి వెళ్ళినపుడు కుంతి అతనిని కౌగలించుకొని ఏడువసాగింది బాల్యంనుండి నేటివరకు అనుభవించిన సమస్త కష్టాలను తలపోసుకొని, తలపోసుకొని ఏడ్చింది హస్తినాపురం వెళ్ళుతూ మళ్ళీ కృష్ణుడు ఒకసారి ఆమెవద్దకు వెళ్ళాడు కుంతి తన పుత్రులకు యిచ్చిన సందేశం, కుంతి మనస్సులో ఆ సమయంలో ముల్లులా గుచ్చుకొంటున్న బాధలకు, భవితవ్యంపట్ల

అనేకుగల ఆశలకు, మానసిక దార్ఢ్యానికి, కాఠిన్యానికి నిదర్శనం ఆమె చెప్పిన సందేశంలో ఒక వాక్యం వస్తుంది రెండు మూడు చోట్ల అదేవాక్యం సామెతలా కూడా వాడబడింది కుంతి ఇలా అంటుంది 'వివాహం మూలకంగా నేను ఒక గుండంనుండి మరొక గుండంలో పడ్డాను (హ్రదాత్-హ్రదమివ)' ఆమె అభిప్రాయానుసారం ఒక మంచిచోటునుండి మరో మంచిచోటికి వచ్చాను రాకుమార్తెగా ఉండేది, పట్టమహిషి అయింది 'ఇతరులు నా ఆశ్రయంలో ఉండవలసిన తరుణంలో నేను ఇతరుల ఆశ్రయం ఆశిస్తున్నాను ' అనే భావం ఆమెకు కలిగింది పాండురాజులాంటి దుర్బలుడి మెడకు కట్టబడింది కనుక నేటి దృష్ట్యా ఆమెపట్ల జాలి కలుగుతుంది కాని ఆమెకు అలా అనిపించలేదు ఏది ఏమైనా పాండు 'రాజు' కదా! అతను ఆమెకు ఇతరులద్వారా పుత్రులను పొందడానికి సౌకర్యం కల్పించాడు పాండురాజు బ్రతికిఉండి హస్తినాపురం వచ్చిఉంటే, ఆమె పట్టమహిషి అయిఉండేది ఆతరువాత సునాయాసంగా రాజమాత అయిఉండేది, కాని ఆమె భర్తయే ఆమెను మొదటిసారి వంచించాడు, ఆ సంకటంనుండి అ ంతో బయటపడి రాజమాత కాబోతూఉండగా, ఆమె కొడుకే ఆమెను వంచించాడు భర్తవల్ల ఆమెకు ఇంద్రియ సుఖం లభించలేదు ఒక్కసారి, అదీ చివరిసారి అనుకోండి, మాద్రికి ఆ సుఖం లభించింది కాని దానివల్ల ఆమె మండిపడ్డది ఆ సుఖం తనకు దొరకదని కుంతికి తెలుసు ఈ ప్రకరణంలో పతి మృత్యువువల్ల పట్టమహిషి పదవీ, పుత్రుల మూలకంగా రాజమాతపదవీ ఆమె కోల్పోయింది ఇది ఆమె దృష్టిలో మహత్తరమయిన కష్టం ఆమె మాద్రిని 'నేను ఆయన్ని ఎంత జాగ్రత్తగా చూచుకొనేదాన్ని' అని ఎత్తిపొడవడంలోగల అర్థమిదే

రాజ్యం పోగొట్టుకొని పుత్రులు వంచనచేశారు సరే, ఇప్పుడు ఇంకో క్రొత్త ఆపద వచ్చిపడింది, జ్యేష్ఠపుత్రుడయిన యుధిష్ఠిరుడూ, అతనికి అత్యంత విధేయులయిన తమ్ముళ్లూ, ఇతరులూ సంధికి సన్నద్ధులవుతున్నారు అప్పుడామె ఈ సంధి ఎక్కడ క్షత్రియోచితం కాకుండానూ, అవమానజనకంగానూ అవుతుందోనని భయపడ్డది అందుచేత ఆమె కృష్ణుడిద్వారా ఈ సందేశం పంపించింది ఆమె కృష్ణుడితో 'భీముడితోను, అర్జునుడితోను తమకు జరిగిన అవమానాలను మరచిపోవద్దని చెప్పు' అని అన్నది

'అవమానాలను మరచిపోవద్దు' అని ఆమె కృష్ణుడిచేత భీమార్జునులకు చెప్పి పంపించింది కాని నిజానికి ఈ ముఖ్యమైన సందేశం ధర్మరాజుకు జ్యేష్ఠపుత్రుడూ, రాజ్యానికి వారసుడూ అయిన ఈతనిలో యుద్ధం చేద్దామని కాని, యుద్ధంలో గెలుపొందుదామని కాని కోర్కెలేదు 'కృష్ణా! యుధిష్ఠిర మహారాజు ధర్మాత్ముడు అతనితో 'నాయనా, నీ ధర్మం నశించిపోతున్నదయ్యా నీవు చేయదలచుకోనిది చేయవద్దు మందుడు, అవిద్వాంసుడు శబ్దజాలంలో చిక్కుపడిపోయిన బ్రాహ్మణునివలె నీకు ఒకటే ధర్మం కనిపిస్తుంది బ్రహ్మదేవుడు తన వక్షస్థలంనుండి క్షత్రియులను పుట్టించింది బాహుబల ప్రదర్శనకు. ప్రజాపాలనంలో రాజు న్యాయాన్ని, ధర్మాన్ని మరచిపోతే వాడు నరకానికి పోతాడు ప్రజల నందరిని కూడ నరకానికి ఈడ్చుకుపోతాడు తండ్రివలన లభించిన రాజ్యభాగం చేజారిపోయింది దాన్ని మళ్ళీ హస్తగతం చేసుకో. నీ ప్రవర్తనచూసి శత్రువులకు ఎంతో సంతోషం కలుగుతున్నదిరా నిన్ను కనికూడా, నేను ఇతరులమీద ఆధారపడి బ్రతకటంకంటె దుఃఖప్రదమైన విషయం మరొకటి ఉంటుందా? నీవు రాజధర్మాన్ని నిర్వర్తించు. పితరులను, స్వయంగా నిన్ను, తమ్ముళ్ళను నరకం నుండి తప్పించు,' ఇంత చెప్పి ఆమె ఊరుకోలేదు ప్రాచీన చారిత్రకాంశాన్ని వినిపించింది అది విదురా (లేక విదులా) - పుత్ర సంవాదమనే పేరిట ప్రఖ్యాతమయింది 'విదురా' అంటే 'జ్ఞానం కల' అని అర్థం. ఆ వర్ణన కుంతియొక్క వర్ణనమే అని మనం గ్రహించాలి ఆమె ఎటువంటిది - యశస్విని, మన్యుమతి

(కోపం, స్వాభిమానం కలది) కులే జాతా (ఉత్తమకులంలో పుట్టినది), క్షత్ర ధర్మరతా (క్షాత్రధర్మాన్ని ఆచరించేది) దీర్ఘదర్శిని (దూరదృష్టి కలది), విశ్రుతా రాజ సంసత్సు (రాజసభలలో ప్రసిద్ధి వహించినది), శ్రుతవాక్యా, బహుశ్రుతా (చాలా విషయాలు తెలిసింది) ఆ పుత్రుడు ఎటువంటివాడు - సింధురాజుచేత ఓడినవాడు, ఎప్పుడూ నిద్రపోయేవాడు, దుర్బలమనస్కుడు, నిరానందుడు, ధర్మజ్ఞానం లేనివాడు, శత్రువులకు ఆనందం కలిగించేవాడు అటువంటి పుత్రుణ్ణి విదుర చివాట్లు పెట్టినట్లు, కుంతికూడా యుధిష్ఠిరుణ్ణి చివాట్లు పెట్టింది ఈ ఉపాఖ్యానంలో కొంతభాగం ఇలా ఉన్నది (ఉద్యోగ పర్వము 131-135)

''నీవు యిలా చచ్చిన మొద్దులా ఎలా నిద్రపోతున్నావు? అరే పామరుడా! పరాజితుడవై నిద్రపోవద్దు లే, నీ శౌర్య, పరాక్రమాల ప్రభావాన్ని చూపించు, చూపించి సద్గతి (వీరస్వర్గాన్ని) ని పొందు అరే కాపురుషుడా! నీవు ఇహలోకంలో కీర్తి, పారలౌకిక పుణ్యం అంతా చేజార్చుకున్నావు పుత్రుడిరూపంలో నీవు నా కడుపున కలిపురుషుడిలా వచ్చావు ఏ రాజవంశంలోను ఇటువంటి వాక్కూరుడూ, ఏ మాత్రం పనిచేయని గాడిదా పుట్టకుండా భగవంతుడు చేయుగాక నీ పేరు సంజయుడని పెట్టబడింది దాన్ని సార్థకంచేసుకో నేనూ, నీ భార్య ఆశ్రయణీయులు (ఇతరులకు ఆశ్రయం ఇవ్వదగినవాళ్ళుగా) ఉన్నాము మమ్ములను ఆశ్రితులను ఎందుకు చేస్తావు?'' అని తల్లి అంటుంది

పుత్రుడు - ''అమ్మా! ప్రపంచంలో లోహాన్నంతా సమకూర్చి, భగవంతుడు నీ హృదయాన్ని క్రోధపూర్ణముగాను, దయారహితంగాను, వైరపూర్ణంగాను తయారుచేశాడు ఏకైకపుత్రుణ్ణి పట్టుకొని ఇలా చివాట్లు పెడుతున్నావు ఇదెక్కడి క్షత్రియాచారమమ్మా! నేను చనిపోయిన తరువాత, లేక నీ కండ్లకు కనబడకుండా పోయిన తరువాత, ఈ సామ్రాజ్యమూ, ఈ అలంకారాలూ, ఈ జీవితమూ నీకు నచ్చుతాయా?'' అని అడిగాడు

''నీవు మాట్లాడడానికి, నా గాయాలకు కారం పూయడానికి ఇదే సమయంరా నాయనా! సామర్థ్యంలేని వాత్సల్యమూ, సహేతుకం కానటువంటి వాత్సల్యమూ గాడిద ప్రేమలాంటిదే నీవు క్షత్రియుడివి, విజయాన్నో లేక మృత్యువునో సాధించు ''

పుత్రుడు చివరి ఎత్తుగా ''నా దగ్గర ధనమే లేదు కదమ్మా! నేను ఏ ఆధారంతో యుద్ధం చేసేది? సేనలు ఎలా సమకూర్చుకునేది?'' అని అన్నాడు.

''అలా అనబోకు, నా దగ్గరగుప్తధనం ఉంది నీవు యుద్ధానికి సిద్ధపడితే అది నీకు ఇస్తాను ''

సంజయుడు యుద్ధం చేశాడు పోగొట్టుకున్న రాజ్యాన్ని తిరిగి సాధించుకున్నాడు

''కృష్ణా! ఈ ఉపాఖ్యానం యుధిష్ఠిరుడికి వినిపించు, అర్జునుడికి వినిపించు. క్షత్రియ స్త్రీ ఏ ఆశలు పెట్టుకొని పుత్రుల్ని కంటుందో ఆ ఆశలను సార్థకం చేసే అవకాశం వచ్చింది అందరూ కలిసి యుద్ధం చేయండి. పెద్దవాణ్ణి రాజుని చేయండి కృష్ణా! నా కోడలుతో తను ఉత్తమకులానికి చెందిన స్త్రీనని జ్ఞాపకం చెయ్యి.''

గుర్రాన్ని కొరడాతో కొట్టినట్లు, కుంతి తన మాటలచే తన పుత్రుల్ని యుద్ధానికి సన్నద్ధం చేసింది భీముడికి, అర్జునుడికి, నకులుడికి, సహదేవుడికి, చివరికి కోడలికి పంపిన సందేశంద్వారా 'యుధిష్ఠిరుణ్ణి శరణాగతుణ్ణి కానివ్వకండి' అన్న భావమే వ్యక్తం చేసినట్లుంది. కుంతీదేవి హృదయం 'వజ్రాయసా' - వజ్రంలా కఠోరమైనదని అనడంలో ఎటువంటి సందేహమూ లేదు కాని ఇంతకంటె కఠోరంగా కర్ణుడు కుంతిని చివాట్లు పెట్టాడు. ఛీ కొట్టాడు ఆమె కర్ణుణ్ణి

కలుసుకోడానికి వెళ్ళకపోయినా ఏమీ బాధలేదు కాని ఆమెకు దుర్యోధనుడి ఎత్తుగడ వ్యర్థం చేయడం ప్రధానం ఇన్నిరోజులు అనుభవిస్తూ వచ్చిన దుఃఖానికి ప్రతీకారం చెయ్యాలికదా! అందుచేతనే గత్యంతరంలేక ఈపనికి ఒప్పుకున్నది ఆమె సాధారణ స్త్రీవలెకర్ణుణ్ణి కలుసుకోవడానికి వెళ్ళింది ఒక ప్రత్యేకమయిన హేతువును సాధించాలా? కర్ణుడు ఎవడు? ఆమె తెలియచెప్పింది. ''ఐదుగురు సోదరులతోపాటు నీవు ఆరవ వాడివి యుద్ధం చేయవద్దు నీ 'సూత పుత్రత్వం' పోయి నీకు 'క్షత్రియత్వం' లభించగలదు ఇలా ప్రలోభం కూడా చూపించింది

కర్ణుడి జవాబు కొరడా దెబ్బకంటె చురుకుగా అంటింది మొదటి సంబోధనలోనే 'క్షత్రాణీ' అని ఎత్తిపొడిచాడు ''క్షత్రాణీ! నీవు చెప్పే మాటలమీద నాకు నమ్మకం ఉంది నాకు రావలసిన పేరు - ప్రతిష్ఠలను సమూలంగా నాశనంచేసిన పాపం నీవు చేజేతులా చేశావు క్షత్రియ వంశంలో జన్మించాను కాని క్షత్రియులకు ఆ తరువాత జరగాల్సిన సంస్కారాలు ఏవీ నాకు జరుగలేదు ఇంతకంటె నాకు అనిష్టం చేసే శత్రువు ఇంకెవరు? ఆ సమయంలో నాపట్ల జాలి చూపించలేదు కాని ఇప్పుడు నన్ను ఆహ్వానించడానికి వచ్చావా? అప్పుడేమో తల్లిలా ప్రవర్తించలేదు ఇప్పుడు వచ్చింది నీ స్వార్థం మూలంగానే కదా! లోగడ నాకు సహోదరులున్న సంగతి తెలియదు. ఇప్పుడు ఒక్కసారిగా సోదరు లని ఎగిరి గంతేస్తే, ప్రపంచం ఏమనుకుంటుంది? నాకు ఈ ప్రపంచంలో సమస్తమూ ఇచ్చిన ధృతరాష్ట్రపుత్రులను ఎలా విడిచిపెట్టగలను? కానీ నీకు ఒక్కమాట ఇవ్వగలను నీ పుత్రులు ఎప్పుడూ ఐదుగురుగానే ఉండగలరు, నేను చచ్చిపోయినా ఐదుగురే, నేను అర్జునుని సంహరించినా ఐదుగురే ఉంటారు ''

కుంతి ఎంతో దుఃఖపడుతూ ఇలా అన్నది - ''కౌరవులు ఎలాగో నశించిపోతారు. సరే నాయనా! నీవు చెప్పినట్లే చేయి అదృష్టాన్ని ఎవడు ఎదిరించగలడు?'' ఈ మాటలవలన కౌరవులతోపాటు కర్ణుడు నశించి పోకూడదనే భావం కుంతి మనస్సులో ఉన్నట్లు గోచరిస్తున్నదా? ఏమో ఇది కూడా ఆమె స్వార్థమేనేమో?

కుంతి తనపట్ల తిరస్కారభావం కలిగించేట్లుగా చేసినట్లు అనిపిస్తుంది. కాని ఇక్కడ కుంతియొక్క మరో రూపం మనముందు సాక్షాత్కరిస్తుంది పతి మృత్యువు తరువాత మాద్రి నెత్తిన ఆ తప్పు రుద్ది గొడవచేసిన కుంతిపట్ల మన మనస్సులో అల్లకల్లోలం రేకెత్తుతుంది ఆ కుంతియే జీవితాంతం మాద్రి పుత్రుల్ని తన స్వంత బిడ్డల్లా సాకుతుంది సహదేవుడిపట్ల ఆమెకు ప్రత్యేకమయిన మమకారం ద్రౌపదిని ముగ్గురికే భార్య చేయగలిగేదే కాని ఐదుగురికి ఆమె భార్య కావలెనని పట్టుబట్టింది ఎందుకని? ఐదుగురిలో అంతఃకలహాలు ఏర్పడకూడదనేదే ఆమె ఉద్దేశ్యమా? కాని అప్పుడప్పుడు ఆమె వెలిబుచ్చిన మాటలవల్ల అలా అనిపించదు ఆమె వారిని (మాద్రి పుత్రుల్ని) తన గుండెలమీద పడుకోబెట్టుకొని పెంచింది చివరివరకు వారిపట్ల మమకారం కలిగే ఉంది కలలో కూడ వారు పరాయి అమ్మగన్న బిడ్డ లనుకోలేదు

కర్ణుడిపట్ల కూడా ఆమె ప్రవర్తన ఇలానే ఉంది కన్యాత్వంలో పుట్టిన పిల్లవాణ్ణి తనతో ఉంచుకోవడం ఆమెకు వీలుపడలేదు ఆ తరువాత ఆమె అతణ్ణి తనవాడని అనలేకపోయింది. కర్ణుడిపట్ల జరిగిన ఈ అన్యాయాన్ని కర్ణుడూ మరచిపోలేక పోయాడు ఆమే మరచిపోలేక పోయింది.

మహా భారతయుద్ధం ముగిసింది. యుద్ధంలో, చనిపోయిన వీరులకు ఉత్తరక్రియలు జరుగుతున్నాయి అటువంటి సమయంలో కుంతి యుధిష్ఠిరుడితో ఇలా అన్నది : ''కర్ణుడు

నా కుమారుడు నేను కన్యగా ఉండగా పుట్టాడు అతడు నీకు జ్యేష్ఠుడు - అందుచేత అతనికి క్షత్రియోచిత సంస్కారాలు నిర్వర్తించు '' బ్రతికి ఉండగా కర్ణుణ్ణి గురించి అనలేనిమాట చనిపోయిన తరువాత అనడంలో గల తాత్పర్యమేమిటి అనే ప్రశ్న ఉదయిస్తుంది కాని దానికి జవాబు సులువు నాకు క్షత్రియోచిత సంస్కారాలు జరిపించలేదనీ, నాకు జన్మతః వచ్చే స్థానాన్ని చెడగొట్టావని కర్ణుడి ఆవేదన కుంతితో జరిగిన చివరి సంభాషణలో కర్ణుడు ఈ విషయాన్ని నొక్కిచెప్పాడు 'తగువిధంగా కర్మకాండ జరిగితే మానవుడికి సద్గతి (మోక్షం) లభిస్తుంద'ని అతడి నిశ్చితాభిప్రాయం ఏమీ చేయలేకపోతే, కనీసం కర్మకాండ (ఉత్తరక్రియలు) అన్నా జరిపించాలి అని ఆమె మనస్సులో వచ్చి ఉండాలి కన్యాత్వంలో జరిగిన విషయాలను గురించి చర్చించాల్సిన అవసరం లౌకికదృష్టిలో లేదు. యుద్ధానికిముందు కృష్ణుడికి ఇది అవసర మనిపించింది కుంతికూడ ఈ అగ్నిపరీక్షకు సిద్ధపడ్డది కాని ఇప్పుడు అటువంటిదానికి అగత్యమేమీ లేదు కాని ఆమె మనస్సు ఆమెను ముల్లులా గుచ్చసాగింది లేకపోతే ఆమె న్యాయనిష్ఠురబుద్ధి ఆమెకు సుతరాం శాంతి కలుగనిచ్చేదికాదు ఏమైనా అనుకోండి, ఆమె సంగతి అంతా చెప్పేసింది లోకులు ఏ మంటారన్నది వేరే విషయం. అయిందేమిటంటే ఆమె స్వయంగా కన్నకొడుకుచేత చివాట్లు తినవలసి వచ్చింది ధర్మరాజు ఈ విషయం తెలిసి చాలా బాధపడ్డాడని అంటారు చివరకు భారతయుద్ధపు దోషమంతా కుంతినెత్తిన రుద్దేసి, తాను తప్పుకుంటాడు ధర్మరాజు 'నీ ఈ గుప్తకార్యం మమ్మల్ని సర్వనాశనం చేసింది పాంచాలురు నాశనమయ్యారు, కురువంశీయులూ నశించిపోయారు ద్రౌపది పుత్రులూ చంపివేయబడ్డారు. అభిమన్యుని పోగొట్టుకున్నాం ఇదంతా ఈ కారణంవల్లనే నీవు ముందే కర్ణుడు మనవాడని చెప్పిఉంటే ఈ యుద్ధం జరక్కపోను ' ఇంతమాత్రమే అని అతను ఊరుకోలేదు సమస్త స్త్రీ జాతికి అసందర్భమయిన ఒక శాపం పెట్టాడు ''ఈనాటి నుండి స్త్రీల నోట మాట దాగదు,'' అని

(శాపం పెట్టాడన్న ఈ సంఘటన ప్రక్షిప్తం అని అనడానికి చాలా అవకాశం ఉన్నది ఎందుకంటె అన్ని పర్వాల్లోనూ కర్ణుని ఉత్తర క్రియలు ధర్మరాజు చేశాడని చెప్పబడి ఉంది తరువాత శాంతిపర్వంలో మళ్ళీ ఒకసారి కర్ణుడి జన్మ వృత్తాంతం వస్తుంది అక్కడ యుధిష్ఠిరుడి నోటివెంట ఈ శాపవాక్యం వచ్చినట్లు చెప్పబడింది )

కుంతి మళ్ళీ ఒకసారి తన దృఢ నిశ్చయం కల స్వభావాన్ని వ్యక్తం చేసింది రాజధానిలో, యుధిష్ఠిరుడి రాచనగరులో 15 సం లు ఉన్న తరువాత ధృతరాష్ట్రుడు అడవులకు వెళ్ళాలని నిశ్చయం చేసుకున్నాడు యుధిష్ఠిరుడు, కుంతి కోడళ్ళు, అర్జునుడు, అందరూ ధృతరాష్ట్రుణ్ణి గౌరవిస్తూ ఉండేవారు కాని భీముడు ప్రేరేపించడంతో నకుల-సహదేవులు, ధృతరాష్ట్రుడు-గాంధారి వినేటట్లుగా ఏదో ఒక కొంటెమాట అంటూ వుండేవారు కాని వారి ఈ వ్యవహారంపట్ల ధృతరాష్ట్రుడు కోపగించుకోవడంలో కాని, వ్యతిరేకంగా మాట్లాడడంలోకాని ఔచిత్యం లేదు అందుచేత తనూ గాంధారి అక్కడనుంచి వెళ్ళిపోవడమే ఉచితమని ధృతరాష్ట్రుడు అనుకున్నాడు వారివెంట విదురుడు, సంజయుడు కూడా బయలుదేరారు కుంతికూడా వారివెంట వెళ్ళడానికి నిశ్చయించుకుంది ఆమె ''ఇన్ని రోజులూ పెద్దవారికి ఎలాంటి సేవా చేసే అవకాశం లభించలేదు ఇప్పుడు సేవలు చేయాలి. నేను అత్తమామల (బావగారు - తోడికోడలు) బాధ్యత వహిస్తాను''! అని అన్నది ఇలా అని ఆమెకూడా వారిని వెంబడించింది పాండవుల ఆక్రోశం విని ధృతరాష్ట్రుడు గాంధారితో కుంతి చాలా కష్టమయజీవితం గడిపిందని ఆమెతో చెప్పమని అన్నాడు ఇప్పుడు కొన్నిరోజులపాటు ఆమె తన పుత్రులతో రాచభోగాలు అనుభవిస్తే బాగుంటుంది కాని కుంతి వారెవరి మాటలూ వినలేదు చివరకు యుధిష్ఠిరుడు కన్నీరు

సింపుకొని 'నీవు ఆ రోజుల్లో వాసుదేవుడి ద్వారా విదుర కథ వినిపించావు నీమాట విని మేము యుద్ధంచేసి రాజ్యం సంపాదించుకున్నాము లభించిన రాజ్యాన్ని, పుత్రులను-కోడళ్ళను, సమస్తమూ వదలిపెట్టి అడవులకు వెళ్తానంటున్నావు ఆనాటి నీ క్షాత్రధర్మం ఏమయిందమ్మా?' అని అడిగాడు కాని కుంతి ధర్మరాజు మాటలు వినలేదు గ్రుడ్లలో కన్నీరు గ్రుక్కుకుంటూ బయలుదేరి వెళ్ళిపోయింది అప్పుడు భీముడు 'ఐదుగురు పుత్రులు సంపాదించి పెట్టిన రాజ్య సుఖాలు వదలిపెట్టి ఎక్కడికి వెళుతున్నావు? ఇలా చేయదలచుకొని ఉన్నట్లుంటే సమస్త నాశకారిణి అయిన యుద్ధం మాచేత ఎందుకు చేయించావు? మాద్రి ఇద్దరు కొడుకులను, మమ్ములను అడవులనుండి హస్తినాపురానికి ఎందుకు తీసుకు వచ్చావమ్మా?' అని అడిగాడు

వారంతా అలా తలా ఒకమాట అంటూనే ఉండిపోయారు ద్రౌపది కన్నీరు కారుస్తూ వెనక-వెనక నడవసాగింది కుంతి మౌనంగా ముందుకు సాగిపోయింది పుత్రులు ఎంత చెప్పినా వినకుండా వెంటరావడం చూచి, ఆమె కన్నీరు తుడుచుకొని ఇలా అన్నది - 'పాండవుల్లారా! మీరన్నదంతా సత్యమే మీరు ధైర్యం కోల్పోతూ ఉంటే కొరడాతో చురుకు అంటించాను మీరు ద్యూతంలో - జూదంలో రాజ్యం ఓడిపోయారు సుఖాలు చేజార్చుకున్నారు మీ వంశమర్యాద, కర్తవ్యం మరచిపోయారు ఆ సమయంలో మిమ్ములను ఉదాత్తులుగా చేశాను పాండురాజు సంతతి నశించ కూడదనీ, మీయశస్సు మట్టిపాలు కాకూడదనీ మిమ్ములను చివాట్లు పెట్టాను మళ్ళీ నేనుగానీ, నా కోడలు గానీ అవమానం పాలు కాకూడదని నేను ములుకుల్లాంటి మాటలతో మిమ్ములను జాగరూకులని చేశాను నాయనలారా! పాండురాజుకి మహిషినై ఉండి, రాజ్య సుఖాలు బాగానే అనుభవించాను, దానాలు చేశాను, యజ్ఞాలు చేశాను, సోమరస పానం చేశాను నాకు ఏదో ఒరగాలన్న ఉద్దేశ్యంతో వాసుదేవుడి ద్వారా సందేశం పంపించలేదు పుత్రులద్వారా సంప్రాప్తించిన రాజ వైభోగాలు అనుభవించాలని నాకు ఇసుమంతైనా కోరికలేదు ఇహ ఇప్పుడు అత్తమామల సేవలు చేస్తూ, పుణ్యప్రదమయిన నాపతి లోకానికి నన్ను పోనివ్వండి మీరు తిరిగి వెళ్ళిపోండి '

కుంతి మాటలు విని పాండవులు సిగ్గుపడి పోయారు ద్రౌపదిని తీసుకొని వెనుదిరిగి వెళ్ళిపోయారు కుంతిని గాంధారి పట్టుకుంది, ధృతరాష్ట్రుడు గాంధారి భుజంమీద చెయ్యి వేశాడు ముగ్గురూ ఒక వరుసలో హస్తినాపురమార్గం వదలి ముందుకు సాగిపోయారు

అడవులకు వెళ్ళిన తరువాత కూడా కుంతి వారికి సేవలు చేస్తూనే ఉంది రోజూ వారిని ఈవిధంగానే గంగ ఒడ్డుకు తీసుకువెళ్ళేది పాండవులు ఒకటి రెండుసార్లు వచ్చి దర్శనం చేసుకువెళ్ళారు అప్పుడు అందరూ ఏడ్చేశారు అడవులకు వెళ్ళిన తరువాత అందరికంటె ముందు విదురుడు మరణించాడు మొత్తంమీద మూడు సంవత్సరాలు అడవుల్లో గడిపిన తరువాత ఒకసారి బ్రహ్మాండమైన దావాగ్ని రేగింది. ఆ ముగ్గురి శరీరాలు భస్మీభూతాలయి పోయినయి చనిపోయేటప్పుడు కూడా కుంతి రొమ్ము విరుచుకునే మరణించింది ధృతరాష్ట్రుడు సంజయుడితో తప్పించుకొని పారిపొమ్మని చెప్పాడు. అగ్ని ముందుకు సాగివస్తున్నకొద్దీ అందరూ నేలమీద కూర్చుండి పోయారు. ఊపిరి బిగబట్టి ప్రాణాయామం చేశారు ఆ స్థితిలోనే సంజయుడు చూస్తూ ఉండగా వారు అగ్నికి ఆహుతి అయిపోయారు

(సంకలనం - శ్రీనాథుడు)

279పేజీ తరువాయి .

-- అంటూ తన శృంగార పాండిత్యం వొలక పోస్తాడు కరటక శాస్త్రులేనా తక్కువ తింది -- ఆ మాటల్నే సాగదీస్తూ --'' సామాన్య సంసారులం మాకా శృంగారాలు యలా అనుభవ మవుతాయండీ మా యిల్లాళ్ళకు కోపంవస్తే చీపురుకట్టలు ఎదురౌతాయండీ --'' అంటాడు చీపురుకట్ట సరసం మా పంతులుగార్కి తెలియందికాదు ఆ సరసమేదో పూటకూళ్ళమ్మ రుచిచూపే వుంది. అందుకే చీపురుకట్టల ప్రసక్తి వచ్చేసరికి పంతులు బిక్కమొహం పెడతాడు. కరటక శాస్త్రుల్లే మళ్ళీ ఆయన్ని మూడ్‌లోకి తెస్తూ --'' సరసవన్నది పుస్తకాల్లో చదవడమేగాని మాకు అనుభవవేద్యం కాదండి. శ్రీ కృష్ణులవారు రాధికతో శలవిస్తున్నారు - ఓ రాధికా! నీకోపం తీర్చుకోవాలన్నష్టేయనా - ఘటయ భుజబంధనం రదయ రద ఖండనం, యేనవా భవతి సుఖజాలం - అనగా యేవంచున్నాడంటే కవీశ్వరుడు - చేతుల్తోటి ఉక్కిరి బిక్కిరి అయ్యేటట్టుగా కౌగిలించుకో, మరిన్నీ పెదిమలు రక్తాలొచ్చేటట్టు కొరికెయ్యి అంచున్నాడు - గాఢ శృంగారం అంటే అదండీ --'' అంటాడు శాస్త్రులుగారి మాటలు వింటూనే పంతులుగారు హడిలిపోయారు. అప్పటి ఆయన ముఖ కవళికలు చూసేసరికి చెప్పొద్దూ నాకు నవ్వు ముంచుకొచ్చింది పంతులు బిక్కమొహం పెట్టి, నాకు వినపడకుండా శాస్త్రులుగారి చెవిలో -- ''ఉప్పులేకనే ముప్పందుం మధురవాణికి మాత్రం యీ వెర్రిమొర్రి కవిత్వాలు చెప్పకండి నాలాంటి మృదువర్లు మోటు సరసం సహించరు --'' అంటూ గుసగుస లాడతాడు కొండమీది గోలేమిటి అంటే కోటిగాడి రహస్యం అన్నట్లు ఆమాటలు నాకు వినపడనూ వినపడ్డాయి - విరగబడినంత నవ్వూ వచ్చింది పంతులుగారి పిచ్చిగాని రాధ అలా చేసిందంటే ఆమెకు కృష్ణుడిమీద ఎంత ప్రేమా ఎంత మోహం వుండివుండాలి? -- ఎందరు ఎన్ని శృంగార శాస్త్రాలు బోధించినా నేను పంతులుగార్ని అలా చేస్తానా? -- ఏదో నాలోజులు బాగాలేక విజయనగరంలో సంజీవరావుగారి అల్లరి కొంచెం మరుపొచ్చిందాకా పైనుందామని యిలా పంతులుగారితో వచ్చానుకాని ఆయనంటే మోహం పట్టలేక వచ్చానా ?

ఈ సంగతులకేం కాని ప్రేమ దగ్గరకు వచ్చేసరికి సీతారాముల ప్రణయాన్ని గురించీ చెప్పుకోవాలి మరునివంటి రాముడు శివ ధనువునే సీత తనూ వల్లిక అనుకొని చేతుల్తో పైకెత్తాడట ఆ మైమరుపులో శివధనువే ఫెళ్ళుమందో సీత తనువే ఝల్లుమందో ఏ కవీశ్వరుడు మాత్రం వర్ణించగలడు -- అయినా -- ''మరుండు నీ మృదుతనూ వల్లీమ తల్లిన్ మదిన్ దన విల్లంచు దలంచి నెన్నడుము చేతం బట్టితా నెత్తగా గనుపట్టెన్ ద్రిజగద్వశీకరణ దీక్షాముద్రలై వ్రేళ్ళ సందున వ్రట్రిల్లిన రేఖలీ త్రివళులై నూత్న ప్రభావం బునన్ --'' అంటూ యీ రమణీయ శృంగార సన్నివేశాన్ని అతిలోక సుందరంగా వర్ణించారు ప్రసన్న రాఘవ ప్రబంధకర్త, నాజూకు శృంగారానికి పరాకాష్ట యీ వర్ణనే అని చెప్పుకో వచ్చు.

ఇష్టం లేనిచోట శృంగారం రసాభాసకే కారణమవుతుంది. పెద్దనగారి దగ్గరనుంచి రామరాజ భూషణుని వరకు ఎందరో కవులు సరసంలో విరసాన్ని వర్ణించే వున్నారు. జయంత వసంత కంతులను జక్కదనంబున గెల్వజాలెడు ప్రవరాఖ్యుణ్ణి చూసి అల్లసానివారి వరూధిని మతిపోగొట్టుకుంటుంది - రాంభొట్లుగారి అచ్చమ్మ గిరీశాన్ని చూసి మతిపోగొట్టుకున్నట్లు పల్లెటూరి పిచ్చమ్మ కాబట్టి అచ్చమ్మ --'' మానాస్తం రాంభొట్లుగారి అచ్చమ్మ మీరు వొప్పుకుంటే మిమ్మల్ని పెళ్ళాడతానంది --'' అంటూ బుచ్చెమ్మతో గిరీశానికి కబురు పంపిస్తుంది - కాని కామశాస్త్రోపధ్యాయిని లాంటి వరూధినికి అలా ఒకరితో కబురుపంపే కర్మేమిటి కనక నిజం దాచటం ఎందుకు నీపయింజిక్కి నాకు మనంబు అంటూ మీదిమీది కెళ్ళిపోతుంది. అప్సరస అలా వలచి తనంతటతాను వస్తుంటే సై అనటం పోయి ఆ ఛాందసుడు ఎంతసేపు మా ఊరు

మాయిల్లు అగ్నిహోత్రం ఆవాలపిండి అంటూ సణుగుడు మొదలు పెడతాడు ఇహ మాటంతో పనికాదని -- ''ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో పాలిండ్లు పొంగార బైయంచుల్ మోవగ గౌగిలించి యధరం --'' బాసిస్తుంది కథ యింతవరకొచ్చినా ఆ జడుడు కరగక ఆమెను పొమ్మంటూ తోసేస్తాడు. ఈ ఘట్టంలో శృంగారం ముదిరి పాకాన పడటమే కాక ఆఖరికి రసాభాస కూడా అవుతుంది రామరాజ భూషణుని వసుచరిత్రలో కోలాహలుడు శుక్తిమతిని బలవంతం చేసిన ఘట్టం కూడా శృంగారం రసాభాస అయిన వైనానికి తార్కాణమే

-- ''వంతి గ్రీడారతి గల్గనేని నీకు గరవే తారుణ్యలావణ్య జృంభిత రంభాది నిలింపభామలు--'' అని శుక్తిమతి వారిస్తున్నా వినకుండా -- ''వట్టి నేమములు చాలు నేలు నన్నని సతి కమలాతి పట్టు ప్రబలతర దీర్ఘ భుజశాఖ బట్టుటయును'' -- శృంగారం బలాత్కారంగా పరిణమిస్తుంది ఈ రోజులలో అయితే యిటువంటి వాటిని రేప్ అంటూ యాగీ చేసేవారు. కోర్టుకు కూడా వెళ్ళేవారు కోర్టు వ్యవహారాలంటే మా పంతులుగారికి సరదాయే పైసా పుచ్చుకోకుండా పనిచేసి పెడతాడు కూడా కాని కొండలు నదులను అడ్డుకొని బలవంతం చేసిన రోజులలో పంతులుగారు పుట్టలేదు -- అదొక్కటే లోటు

వెనకోసారి గిరీశం అన్నట్లు విరిశరాలు చేసే గాయాలు పైకి కనపడవు లోలోపలే తహతహ పుట్టిస్తాయి అందుకే కృష్ణుడంతటి వాడుకూడా - రాధ కనపడితే ప్రేమాతిరేకంతో నిద్రపోబుద్ధి పుట్టదు ఆవిడ కనపడకపోతే విరహాతిరేకంతో కన్నే మూతపడదు ఏం దారి అంటూ మధనపడిపోతాడు -- ''మునుపు నిద్దర లేదయ్యె ముదిత నెనసి, వెనుక నిద్దుర లేదయ్యె వెలది బాసి యేమి చెప్పుదు మన్మధస్వామి మాయ --'' అంటూ అంతటి దక్షిణ నాయకుడూ ఆపసోపాలు పడిపోతాడు ముద్దుపళని దగ్గరనేర్చుకున్న ముద్దుపలుకుల తెలుగులో ఆడది మెచ్చిందే అందం అన్నట్లు సరసశృంగారం కూడా ఆడవాళ్ళ చేతుల్లోనే బంగారంలా తళతళమంటూ మెరుస్తుందని చెప్పవచ్చు అందుకు ముద్దుపళని వంటి కవయిత్రులే సాక్షి రాధికా సాంత్వనములో శృంగారం ముదిరిందని కొందరంటారుకాని నేనామాట ఒప్పుకోను - కాస్త గస్తి పాకానపడి తీగలు సాగిందంటాను

ఆవేశం మనిషికి అన్ని వేళల్లోను వస్తుంది కోపం వస్తే నేను మనిషినికాను అంటూ వుంటాడు అస్తమానం అగ్ని హోత్రావధాన్లు మావగారు ఆయనకు కోపం ఎప్పుడూ వస్తూనే వుంటుంది అలాంటప్పుడు ఆ మహానుభావుడు మనిషిలాగ ఎప్పుడుంటాడో కన్యాశుల్కం కడంటా చూసినా ఎవరికీ బోధపడదని నేను గ్యారంటీగా చెప్పగలను ఆ మాటలకేంగాని కోపావేశం లాంటిదే శృంగారావేశం కూడా ఆ ఉద్రేకంలో కూడా మనిషి తనను మరిచిపోతాడు అందుకే కాబోలు ఓ కవీశ్వరుడు -- ''చక్కెరకెమ్మోవి చవి చూడనెగాని మొనపల్లు చురుకున మోపరాదు, బలితంపు గుబ్బలు పట్టి చూడనెగాని నునువాడి గోరుల నొక్కరాదు, అంగంబు మెల్లన అక్కు జేర్చనెగాని మించి బిగ్గ గౌగిలించరాదు --'' అంటూ ఈగవాలిన కందు ఓ యిగురుబోడితో సరసానికి సిద్ధమౌతున్న ధీరనాయకుణ్ణి హెచ్చరిస్తాడు. ఈ కవిగారికి నాజూకు శృంగారం పట్లే మక్కువ కాబోలు

ఆవకాయలో ఆరురకాలున్నట్లే శృంగారంలో కూడా స్వీయ శృంగారం, పరకీయ శృంగారం, పణ్య శృంగారం వగైరా వివిధరకాల వేషాలూ వున్నాయి ఎంతయినా మగవాళ్ళది పొరుగింటి పుల్లకూర రుచి అనే బుద్ధి కాబట్టి పరకీయ శృంగారానికే పట్టం కట్టి ఊరేగించారు అసలా మాటకొస్తే రాధ పరకీయ కాదూ? అంతదాకా ఎందుకుగానీ మా రావప్ప పంతులుకూడా పరాయి వాళ్ళతో సరసాలాడటంలో ఘటికుడే మీనాక్షితో చాటుమాటుగా శృంగారం వెలగబెడుతూనే వుంటాడు ఓరోజు అర్ధరాత్రి లుబ్ధావధాన్లు యింటికి వచ్చి మీనాక్షిని

కౌగిలించుకొని యెత్తుకుంటాడు -- "ఇదిగో యిలా యెత్తుకు తీసుకుపోతాను నిన్ను రాజమహేంద్రవరం --" అంటూ అప్పుడు లుబ్ధావధాన్లు వచ్చి కర్రతో కాళ్ళమీద కొడితే మీనాక్షిని కిందపడేసి కుంటు కుంటూ వెళ్ళిపోతాడు రావప్ప పంతులు "కానేళ యిల్లు జొరబడితే బుగత తన్నడా --" అంటూ ఆఖరికి అసిరిగాడు కూడా పంతుల్ని వెక్కిరిస్తాడు ఇంతవరకు వచ్చేసరికి యిహ మీనాక్షి తెగించి -- "మరి యింట్లో అడుగుపెట్టను నా సరుకులు లేకపోతే పోయెను రండి రాజమేంద్రం పోదాం --" అంటూ వెంటపడుతుంది ఆడవాళ్ళు తెగిస్తే మరి వెనకాముందూ చూడరు కాదూ? -- కాని మరీ మీనాక్షిలాగా యింత మోటుగా కాక చాతుర్యం వొలికిస్తూ తమ మనోభావాలు వెల్లడించే జాణలు కూడా లేకపోలేదు అనంతామాత్యుని సృష్టి అయిన ఓ చతుర తనను గోడచాటునుండి తొంగిచూస్తున్న నాయకుణ్ణి భయంలేదు మొగుడు యింట్లోలేడు రమ్మంటూ --బహుదర్జాగా ఆహ్వానిస్తుంది "అత్తయు నూర లేదు మగడామరి మందకు బోయిరాడునే నిత్తరి నొంటినుంటి --" అంటూ గ్రీన్ సిగ్నల్ యిచ్చేస్తుంది ఇలాంటి వాటిని గడుసు శృంగారాల ఖాతాలో జమ చేసేయొచ్చు కాదూ?

అంతేకాదు ఎవరోకవి సతతము మైధున చింతయె అన్నట్లు యిలాంటి వారి ఆలోచనలు ఎప్పుడూ శృంగార సుఖాల చుట్టూతానే పరిభ్రమిస్తూ వుంటాయని కూడా చెప్పుకోవచ్చు కాబట్టే పూజారి గవరయ్య కామినీ పిశాచాన్నీ దాని మొగుణ్ణీ కూడా బంధించి సీసాలో పెట్టానని చెప్పినప్పుడు -- "యిద్దర్నీ వో సీసాలో పెడితే దెయ్యప్పిల్లల్ని పెడతారేమో " అన్న దివ్యమైన సందేహం కలుగుతుంది మీనాక్షికి రాతల్ని బట్టే బుద్ధులు అన్నట్లు ఎవరి సంస్కారాన్ని బట్టేకదా వారి ఆలోచనలు వుంటాయి

ఇటువంటి వాళ్ళ సంగతి ఎలావున్నా మాయామర్మం తెలియని అమాయక జీవుల భావజాలం ముందు యిలాంటి శృంగార శాస్త్రాలన్నీ దిగదుడుపే కాదూ? "సల్లని యెన్నెట్లో సాపేసి కూకుంటె ఒట్టమ్మి ఒల్లంత ఉలికులికి పడతాదె --" అంటూ నాయుడుబావ పట్లతనకు గల అనురాగాన్ని ఎంత నాజూగ్గా వ్యక్తం చేస్తుంది ఎంకి? అసలు యిలాంటి నాజూకే శృంగారానికి వన్నె తెస్తుందంటాను నేను అందుకే బెండకాయలు ముదరకూడదు బ్రహ్మచారులు ముదరకూడదు శృంగారమూ సరస రసార్ణవపు హద్దులు దాటకూడదు. అప్పుడే ఆనందం ఆర్ణవమవుతుంది -- అనురాగం అంచులు తాకుతుంది!

## The Evolution of Despair

A new field of science examines the mismatch between our genetic makeup and the modern world, looking for the source of our pervasive sense of discontent

* * * * * * * * * * *

"[I] attribute the social and psychological problems of modern society to the fact that society requires people to live under conditions radically different from those under which the human race evolved ." -THE UNABOMBER

* * * * * * * * * * *

This much is fairly obvious and, indeed, is a theme going back at least to Freud's *Civilization and Its Discontents* But the analysis rarely gets past the obvious, when it does, it sometimes veers toward the dubious Freud's ideas about the evolutionary history of our species are now considered - to put it charitably- dated He hypothesized, for example, that our ancestors lived in a "primal horde" run by an autocratic male until one day a bunch of his sons rose up, murdered him and ate his flesh-a rebellion that not only miraculously inaugurated religion but somehow left a residue of guilt in all subsequent descendants, including us Any questions ?



ఆంటోనియో కానోవా శిల్పం - 'ది త్రి గ్రేసెస్'
(స్కాట్‌లాండ్ నేషనల్ గ్యాలరీ)

MISIMI/మిసిమి RNI Regd No 45042/90 Telugu Monthly, Hyderabad-500 02

Postal Regd No H/SD/19